# భారతరత్నములు

ఉభయభాషాప్రవీణ
చింతలపూఁడి శేషగిరిరావు, బి. ఏ.,




కవిరాజ పబ్లిషర్సు
తెనాలి :: సికింద్రాబాదు

Approved by the Andhra T. B. C. for class use :
Vide Page No. 39 of the Andhra Gazette D/12-4-1956.

# భారతరత్నములు

(REVISED)

ఉభయభాషాప్రవీణ

చింతలపూఁడి శేషగిరిరావు, బి.ఏ.,

బోర్డు హైస్కూలు, నిడుబ్రోలు.




కవిరాజ పబ్లిషర్సు

తెనాలి :: సికింద్రాబాదు

 1956 [ వెల : రు 0-15-0

# విషయసూచిక

# మహాత్ముఁడు

మహాత్ముని సంపూర్ణనామము మోహనదాసు కరంచంద గాంధి. మహాత్ముఁడనున దాతని సుగుణసంపదవల్లను మహాత్మ్యమువల్లను ప్రజానీక మాతని కొసంగిన బిరుదము. గాంధి యనునది గృహనామము. వైశ్యకుటుంబమున జన్మించిన మహాత్ముఁడు భారతీయుల కారాధ్యదైవము. భరతపుత్రు లెల్ల రాతనికిఁ బుత్రప్రాయులే యైనను సన్నిహితు లాతని 'బాపూజీ' యని పిలుతురు. భారతీయులు కొంద రాతని విష్ణ్వంశసంభూతుఁడని యెంతురు. మరికొందఱు బుద్ధుఁడు, ఏసు, మహమ్మదు మొదలగు నుత్తమ మత ప్రవక్తల తరగతియందుఁ జేర్తురు. ఇట్లాబాలవృద్ధము నాతని నాదర్శ పురుషోత్తమునిగను నైతిక నాయకునిగను శాంతి దూతగ నెంచి పితృభావమునఁ బూజించుటకుఁ గల హేతు వేమి? లేకపోలేదు. ఆయన సుగుణఖని. సత్యాన్వేషణ తత్పరుఁడు. మనోవాక్కాయముల హింస యెఱుఁగని మహానుభావుఁడు. ఆత్మత్యాగమే యాతని జీవితపరమావధి. శాంత్యహింస లాతని ప్రబలాయుధములు. ఆతఁడు కర్మయోగి. తా నే సిద్ధాంత ప్రబోధము గావింప నెంచినను బ్రథమమున తా నాచరించికాని యన్యుల కుపదేశింపఁడు. ఇతర నాయకులకు నాతనికుండు ప్రధాన తారతమ్య మిద్దియే. ఎట్టి కట్టిడి శత్రువునైన మహాత్ముఁడు వరాలోలుకు తన

బోసినోటి నవ్వుతో బోల్తా గొట్టింపఁ గలఁడు. ఆతని ముఖ మండలమునఁ దాండవించు తేజః ప్రభావ మట్టిది.

మోహనదాసు కరంచందు గాంధి పోరుబందరను పట్టణమున జనించెను. తండ్రి పేరు కాబాగాంధి. ఈతఁడు రాజకోటయందు రాజకీయోద్యోగమున నుండెడివాఁడు. విద్యావ్యాసంగ మంతగ లేకున్నను ప్రాపంచిక వ్యవహారములఁ గాచి వడపోసినవాఁడు. మోహనదాసుని తల్లి యత్యంత దైవభక్తి పరాయణ. శిష్టాచార సంపన్నురాలు. కావుటం జేసియే కన్నకొడుకగు కరంచందున కాస్తిక్యబుద్ధి యుగ్గుపాలతోడనే యలవడినది. 'అవు చేనిలో మేయు దూడ గట్టున మేయునా?'

మన మహాత్మునకుఁ జిఱుత ప్రాయముననే విద్యాభ్యాస మొనర్పఁబడెను. కాని ప్రాథమికవిద్య యాతనికంతగ నొంటఁ బట్టదయ్యెను. ఏది యెట్లున్నను లెక్కములు మాత్రము తనకు కష్టసాధ్యము లయ్యెనని యాతఁడే యంగీకరించెను.

మోహనదాసతని బాల్యముననే పదుమూఁడగు నేఁట వివాహితుఁ డయ్యెను. 'వివాహో విద్యానాశాయ' యనుచు ట్లనంతర మొక్క సంవత్సర మాతని విద్యాభ్యాసమున కంతరాయము కల్గెను. ఆతని భార్య కస్తురిబాయి నిక్కముగ్గు సహధర్మచారిణి. పతివ్రతాశిరోభూషణము. భర్తకు తగిన నిరాడంబరజీవి యగు భార్య.

వివాహానంతర మొక్క సంవత్సరమునకు మహాత్ముఁడున్నత పాఠశాలయందలి విద్యాభ్యాసమున కుపక్రమించెను. అతి కష్టముపై నాతనికిఁ గొలఁదిగ సంస్కృత భాషాజ్ఞానమలవడెను. అది యూతగ నాతఁడు హిందూమతోద్గ్రంథముల నర్థము చేసికొనఁ గలిగెడివాఁడు. భగవద్గీత యాతని యభిమాన గ్రంథము.

జననీజనకుల సేవ యనిన బాపూజీకి మిగుల నిష్టము. తండ్రికి శరీరారోగ్య భంగము గలిగి యాతఁడు శయ్యాగతుఁడుగ నుండినపుడు మోహనదా సాతని కనేకోపచారములొనర్చి పితౄణము నీగఁ గల్గి కృతార్థుఁ డయ్యెను. కాని యచిరకాలముననే మరణదేవత యాతని తండ్రిని పొట్టఁ బెట్టికొనెను. 'సుకృతీ గతాయుః' అని గదా! తండ్రి మరణానంతరము మహాత్ముని కొక పుత్రుఁడు మఖలోఁబుట్టి పుబ్బలో నంతరించెను.

గాంధిజీ కతిపయకాలమునకుఁ బ్రవేశపరీక్షయం దుత్తీర్ణుఁడై కళాశాల విద్యను గడింపఁ గడగెను. కాని యయ్యది తన తత్త్వమునకు సగిపడమి శీఘ్రముగ స్వస్తిచెప్పి కొంపఁ జేరవలసివచ్చెను. పిమ్మట వారి కుటుంబమునకుఁ జిరపరిచితుఁడగు నొక్క బాపని ప్రోత్సాహమున నాతఁడు న్యాయశాస్త్ర విద్య నార్జింప సీమకేగెను. కాని యాకాలమున సముద్రయాన మాచరణీయముకాక యకార్యకరణముగ నెంచఁబడుట నూరివా రాతని కుటుంబమును బహిష్కరించిరి.

ఎట్లైనను మహాత్ముఁడు పసికందునగు నేకైక పుత్రుని, పతి
వ్రతామతల్లియగు సతీమణిని, వృద్ధయగు మాతను వీడి
లండను ప్రయాణము సాగించెను. విదేశయానమునకు ముం
దాతఁడు మాంస మంట ననియు, బ్రహ్మచర్యము వీడననియుఁ
దల్లియొద్ద శపథము చేసి యద్దాని నిలఁబెట్టుకొనఁ గల్గెను.

లండను పట్టణమున నాతని కానిబిసెంటు మున్నగు
దివ్యజ్ఞానుల పరిచయభాగ్యము కల్గెను. అది కారణముగ
నాతనికి హిందూమత గ్రంథాభిమానమును నభిరుచియు
మెండయ్యెను. తదుపరి యాతఁడు క్రైస్తవ మతమును
దెలిసికొనఁగోరి యా మతగ్రంథమును బఠింపసాగెను. అందు
'కుడిచెంపఁ గొట్టిన నెడమచెంపఁ జూపు' మను శాంతి
సిద్ధాంతమును, 'అపకారి కుపకారము చేయుము' మను శత్రు
వశీకరణ మంత్రమును నాతని మనము నెక్కుడుగ నాకర్షిం
చెను. అంతట హిందూ క్రైస్తవ మతసిద్ధాంతముల నాతఁ
డవలోకించి సమన్వయింప సమకట్టెను.

చతుర్వర్షము లిట్లు సీమయందుఁ గడపి బారిస్టరు
పట్టము స్వీకరించి మహాత్ముఁడు గృహోన్ముఖుఁ డయ్యెను.
ఇలుసేరగనే కార్యాంతరమున నాతనికి దక్షిణాఫ్రికా పయ
నము తటస్థించెను. పోరుబందరునందలి యొక మహమ్మ
దీయ వర్తకసంఘమునకు దక్షిణాఫ్రికాయందు విలువగల
యభియోగ మొండు తటస్థించెను. మహాత్ముఁడే తన్నిర్వహ
ణార్థ మట కేగవలసి వచ్చెను. మహాత్ముఁ డచటఁ గోల్డి

కాలమే యుండ నిశ్చయించుకొనెను. కాని యచటఁగల భారతీయుల కష్టములను జూచి వీడి రాఁజాలక యచటనే దాదా పిరువది సంవత్సరము లుండెను. ఆ దినములందు దక్షిణాఫ్రికా భారతీయులు రాజకీయముగను, సాంఘికముగను పెక్కు కడగండ్లకు గురియైరి. 'మహాగజాః పలాయంతే మశకానాంతు కాకథా' యనునట్లు మహాత్ముఁడే యసంఖ్యాకములగు నవజ్ఞలకు లోనుగావలసివచ్చె ననిన నితరులమాటఁ జెప్పనేల !

జాతిద్వేషము కతమున మహాత్మునకుఁ గలిగిన దుర్భరావమానముల నొకటి రెంటి నిచటఁ బొందుపఱచుట సమంజసము. దర్బారునందలి న్యాయాధికారి మహాత్ముని శిరోవేష్టనమును దీసివేయుమని యాజ్ఞాపించెను. కాని యాత్మగౌరవము గల మహాత్ముఁ డట్లొనర్పఁజాలక న్యాయస్థానమును వదలి వెలుపలికిఁ బోవలసి వచ్చెను. మఱియొకతూరి యాతఁడు ధూమశకటమున ప్రిటోరియా కేఁగవలసి వచ్చెను. ఈ పయనమున భారతీయుల హైన్యస్థితియు నవమానములును నాతని కద్దమునందువలెఁ ప్రత్యక్షీభూత మయ్యెను. తాను మొదటితరగతి టిక్కెట్టు కలిగియుండినను నాతరగతి పెట్టెనుండి యాతఁడు నిష్కారణముగ నిష్కాసితుఁ డయ్యెను. ఇంకొకప్పు డాతఁడు బండిలోఁ బోవునపుడు బండివానితోఁ బాటు బయట కూర్చుండవలసి వచ్చెను. కొండొకప్పు డాతనికి హీనుఁ డగు నొక శకట

చోదకునిచే దేహశుద్ధి చేయఁబడెను. తెల్లమొగమువా రాతని 'శామీ' యనియు 'కులీబారిష్ట' రనియు నిందా ముగఁ బిలువసాగిరి. వ్యష్టిగను సమష్టిగను భారతీయులు గురియగుచున్న యీ యవమానపరంపరఁ గాంచి శ్వేత జాతుల యహంభావ పూరిత మనముల మార్చ నెంచెను. దక్షిణాఫ్రికాకుఁ దొలుత మహమ్మదీయుల పనిమీఁదఁ గదా మహాత్ముఁడు వెడలెను! దీనికిఁ దోడుగ నతని కచటను బెక్కుఱు మహమ్మదీయమిత్రులు లేర్పడిరి. అది కారణముగ నాతనికి మహమ్మదీయ మతమునందు గూడఁ బరిచయము గలిగి యా మతగ్రంథమగు 'కురాను'కుఁ గల భాషాంతరీ కరణము సావధానముగఁ బఠింపఁ గడఁగెను. క్రైస్తవ మతస్థులు కొందఱు మహాత్ముఁడు మతాంతరునిగ మార్చి తమ మతమునందుఁ జేర్చుకొనఁ బన్నాగములు పన్నిరి. కాని యాతఁ డట్టి యల్పమనస్కుల కందువాఁడు గాఁడు. తుదకు మహాత్ముఁడు తన పలుకుబడిని వినియోగించి తాను వాదించెడి యభియోగమును న్యాయస్థానమునఁ గాక మధ్య వర్తుల ద్వారా పరిష్కరింపఁ గలిగెను.

ఇట్లు కృతకృత్యుఁడైన మహాత్ముఁడు గృహోన్ముఖుఁడుగా సమకట్టెనుగాని యనివార్యములగు కార్యములచే నతఁ డచటనే యింక కొంతకాలముదనుక నిలువవలసి వచ్చెను. దక్షిణాఫ్రికా భారతీయుల కడగండ్లఁ గూర్చి యాతఁ డచటఁ బెక్కుమహోపన్యాసము లొసంగెను. ఇంటికి

మరలు సన్నాహమున నుండ నాతఁ డకస్మాత్తుగ నొక వార్తా పత్రికయందు భారతీయుల వోటింగుహక్కు రద్దయినట్లు చదువఁ దటస్థించెను. అంత మిత్రుల ప్రోద్బలమున నతఁ డచటనే నిలచి భారతీయ పౌరస్వత్వముల నిలఁబెట్ట సంకల్పించెను. ఉత్తరక్షణముననే యాతఁ డొక వినతిపత్రమును సిద్ధపఱచి నెటాలు రాష్ట్రపు శాసనసభకు సమర్పించెను. అచటి భారతీయు లందఱొక్కుమ్మడిగ నీ యుద్యమమునకుఁ జేయూత నొసంగిరి. ఆ కాలమున బ్రిటిషు మంత్రివర్గము నందు రిప్పను ప్రభువు వలసరాజ్యముల మంత్రి. మహాత్ముఁ డీ వినతిపత్రపు నకలును రమారమి పదివేల సంతకములతో నాతనికిఁ బంపెను. మఱల నొకసారి మహాత్ముఁడు గృహాభిముఖుఁ డయ్యెను. కాని మఱల నాప్తులు నిర్బంధించి యచటనే యుండి తమకు నాయకత్వము వహింపు మని యర్థించిరి. అందుల కాతఁ డంగీకరించెను. కాని వేతన స్వీకరణమునకు మాత్ర మిచ్చగింపక వణిక్సంఘముల యభియోగములందు వాదించి యర్థాన వచ్చు రాఁబడి ద్వారా జీవనము గడుప నిశ్చయించెను. అచిరకాలమున నాతఁడు నెటాలునందు భారత జాతీయ మహాసభను స్థాపిత మొనర్చి యచటి భారతీయుల విద్యాగృహసౌకర్యారోగ్య పారిశుద్ధ్యముల సంస్కరింప సాగెను.

అంత కొలఁది కాలమున విశ్రాంతి నర్థించి మహాత్ముఁడు స్వదేశమునకు మరలెను. ఇచట నున్నప్పు డాతఁడు

వృథా కాలయాపన మొనరింపక దక్షిణాఫ్రికా భారతీయుల యిక్కట్లం గూర్చియు, వారి హైన్యస్థితిని గూర్చియు నుపన్యాసముల వలనను, కరపత్రముల మూలమునను గ్రంథరూపమునను నసామాన్య ప్రచార మొనర్చెను. ఏతత్కారణమున దక్షిణాఫ్రికా యందలి శ్వేతజాతులవారు కోపోద్రిక్తమానసులై గాంధీజీని నాతని కుటుంబమును మరల నెటాలుసందడుగిడకుండం జేయవలె నని పెక్కు ప్రయత్నములు పన్ని గొప్ప కృషి యొనర్చిరి. కాని సిద్ధసంకల్పుండగు మహాత్ముండవాంతరముల నెల్ల నెట్లో కడచి నెటాలు చేరంగల్గెను. కాని యోడనుండి భూమిపై నడుగిడగనే తమపాలిటి చిచ్చుబుపిడుగు వచ్చి పడుచున్నదని యెంచి ప్రత్యర్థు లాతనిం జుట్టుముట్టి కొట్టసాగిరి. ఆనాండు పోలీసు సూపరింటెండెంటు భార్య తగిన యదనున నాతని రక్షణకు రాకున్న మహాత్ముండు 'హరీ' యనవలసి వచ్చెడిది. కాని యింతేం డింకను మహోత్కృష్టములగు ఘనకార్యము లెన్నియో చేయవలసి యుండ నన్యథా యెట్లు ఘటిల్లును.

ఇంతలో నెటాలునందు దైవికముగ నొక సంఘటనము జరిగెను. అదియే బోయరు యుద్ధము. ఇదియ తమ పగ సాధింపం దగిన యద నని నెటాలునందలి భారతీయులీ యుద్ధమున బ్రిటిషు వారికి సాయ మొనరింప మానిరి. కాని చంపందగిన యట్టి శత్రువు చేంజిక్కినను నపకృతి యొనర్ప నేరని మహాత్ముండు వారి కెట్లో నచ్చంజెప్పి యుద్ధమునందుం

గాల్గొనునట్లు చేసి తన యద్వితీయ రాజభక్తిని బ్రకటించెను. తాను స్వయముగ రక్షణసేనాధిపత్యమును వహించి ప్రాణములకు సైతము తెగించి యుద్ధరంగమున గాయములందినవారికిఁ బెక్కు లుపచారము లొనర్చి యనన్యమగు తన భూతదయను మానవసేవను బ్రకటించెను.

ఈ యుద్ధమున బ్రిటిషువారికి జయమబ్బి ట్రాన్సువాలు రాష్ట్రముగూడ వారికి హస్తగత మయ్యెను. కాని కృతఘ్నులగు హూణులచటి భారతీయుల ద్విగుణీకృతముగ వేధింప సాగిరి. జాతి ద్వేషము మఱింత పెచ్చు పెరిఁగెను. కఠినశాసనములు పెక్కు భారతీయుల నెత్తిపై రుద్దిరి. అంతట మహాత్ముఁడు భారతీయుల యగచాట్లకు సులువుగఁ బ్రపంచమునకుఁ జాటుట కనువగు నొక పత్రిక స్థాపించి జొహాన్సుబర్గున నివాస మేర్పఱచుకొనెను. ఇంతలో జూలు సంఘర్షణ యను మఱియొక సంఘటన సంభవింపనందునను మహాత్ముఁడు బ్రిటిషువారికిఁ జేదోడువాదోడుగ వ్యవహరించెను. ప్రభుత్వమువా రాతని సేవను గడుంగడు శ్లాఘించిరి. కాని యసంఖ్యాకములగు గఠిన చట్టములఁ గావించి క్రమక్రమముగ బ్రిటిషువారు భారతీయుల స్వేచ్ఛ నరికట్టసాగిరి. భారతీయులు ప్రభుత్వ పట్టికలందు దమ వ్రేలిముద్రల వేయవలయు ననుట యట్టి శాసనములం దొకటియై యుండెను.

ఇట్టి దుష్టశాసనము సహింపఁజాలక భారతస్వత్వ

రక్షణ దీక్షాదక్షుఁడగు మహాత్ముఁడు గాంధి స్వరచిత శాసనధిక్కారాయుధమును బ్రయోగించి యద్దానిఁ బ్రతిఘటింపఁ దలఁచెను. ఇట్టి సత్సంకల్పము తన మనమును బ్రేరేపింప నాతఁడు జోహాన్సుబర్గు పట్టణమున నొక మహాసభ గావించి యట్లు తీర్మానింపఁ జేసి భారతీయ శాసన ధిక్కారమునకుఁ బ్రారంభోత్సవము గావించెను. ఈ సముద్యమమునకు నామకరణ మహోత్సవము గావింప నాతఁడు తీవ్రముగ నాలోచించెను. కొందఱు దీనికి సదాగ్రహనామము సూచించిరి. కాని మహాత్ముఁ డద్దానికి సత్యాగ్రహమను పవిత్ర నామకరణ మొనర్చెను. భారత దాస్యశృంఖలా విచ్ఛేదమున కిదియ ప్రథమ సోపానము.

ఈ దుష్ట శాసనము దొలఁగింపఁ జేయుటకు మహాత్ముఁ డత్యంతతీవ్రకృషి యొనర్చెను. తాను నాయకత్వమువహించి యొక రాయబారవర్గము నిండియా మంత్రిసముద్దనకుఁ దీసికొని పోయి యట సమాకల్యముగ నీ దుష్టశాసనమును గూర్చి చర్చించెను. రాయబారవర్గము తమ తిరుగు ప్రయాణము కొంతదూరము సాగించినప్పటికిఁ గఠనశాసనము రద్దు గావింపఁబడెనను వార్త చేరెను. కాని యేమి ప్రయోజనము ? వారింకను మధ్యేమార్గమున నుండగనే ట్రాన్సు వాలునకు బాధ్యతాయుత స్వపరిపాలన మొసంగఁబడెను. వారింక తమ యిచ్చవచ్చిన శాసనముల నిర్మించుకొని యమలుపఱచుకొన జొచ్చిరి. అది కారణముగ నీ నిర్బంధ

శాసనము తప్పదయ్యెను. భారతీయు లనేకు లీ శాసనమును దిరస్కరింపఁ బ్రారంభించిరి. ఏతత్ఫలితముగ మహాత్ముఁడును మఱికొందఱును గారాగార మలంకరింపవలసి వచ్చెను. అంత మహాత్ముఁడు స్మట్సుదొరతో నొక యొడంబడిక గుదిర్చికొనెను. కాని దొరవారా యొడంబడికను భంగపఱిచినందున శాసనధిక్కారోద్యమము పునః ప్రారంభమయ్యెను. ఇది యిట్లుండఁ 'బులిపైఁ బుట్ర' యనినట్లు 'గాయముపైఁ గారము జల్లి' నట్లు మఱియొక కఠినశాసనము నిర్మింపఁబడెను. దీనివలన నాసియావాసు లెవరును ట్రాన్సువాలునం దడుగిడరాదు. 'మూలిగెడినక్కపైఁ దాటికాయపడి' నట్లు దుష్టశాసన భారమునఁ గ్రుంగి కృశించుచున్న భారతీయులకు నేటాలున మరియొక సంఘటన హఠాత్సంభవమయ్యెను. అయ్యది బొగ్గుకార్మికుల సమ్మె. మహాత్ముఁడుత్తరక్షణమునసే యక్కలు గట్టికొని యటకు వ్రాలి దరిద్రనారాయణులగు నా సమ్మెదార్లను బెక్కఱను ట్రాన్సువాలు నకుఁ జేర్చెను. తత్ఫలితముగ మహాత్ముఁడును నాతని యనుచరులును మరల నొకతూఱి శ్రీకృష్ణజన్మస్థానమలంకరింపవలసి వచ్చెను. దీనికిఁ దోడుగ నీ స్వాతంత్ర్య సమరజ్వాలల నార్పుటకు బ్రిటిషువారు పెక్కు కఠినచర్యలవలంబించిరి. మహాత్ముని భారతీయు లెక్కువగ లేని యొక ప్రదేశమునకు మార్చిరి. సమ్మెదారులను తుపాకిగుండ్ల కెఱ చేసియుఁ గఱ్ఱలతోఁ జావమోదియు నిర్బంధముగ మరల

నెటాలునకుఁ దీసికొనిపోయిరి. ఇట్టి ఘోరావమాన పరంపర మన దేశమందలి భారతీయుల మనములందు ద్వేషాగ్ని రగుల్కొల్పెను. అప్పటి రాజప్రతినిధి యగు హార్డింజి ప్రభువుగూడ నీ హీనచర్యలను గఠినముగ విమర్శించెను. ఇట్టి పరిస్థితుల విచారించుట కెట్లో యొక విచారణసంఘ మేర్పడి తత్ఫలితముగ మరల గాంధిజీకిని స్మట్సునకును మఱియొక యొడంబడిక కుదిరెను. అది కారణముగ భారతీయుల కష్టములు గట్టెక్కుట కొక చట్ట మేర్పడి యీ సమరమున సత్యాగ్రహాయుధ సహాయమున భారతీ యులే విజయము గాంచఁగల్గిరి.

కతిపయ దివసములకు గాంధీ మరల లండనుకుఁ బయ నింపవలసి వచ్చెను. ఆతఁడు మధ్యేమార్గమున నుండఁగనే 1914–వ సంవత్సరపుఁ బ్రపంచ సంగ్రామము ప్రకటిత మయ్యెను. లండను చేరగనే మహాత్ముఁడు భారతీయ పటాల మొకదానిని సంసిద్ధ మొనర్చెను. అంత మహాత్ముఁ డొక రుగ్మతకు గుఱియై స్వదేశమును జేరెను. వెంటనే భారత కార్మికులను నిర్బంధముగ విదేశములకుఁ బంపరాదని యొక యాందోళన ప్రారంభించెను. కాని ప్రభుత్వమువా రద్దానిఁ బెడచెవినిఁ బెట్టిరి. మహాత్ముని యాందోళన వారియెడ 'చెవిటికి సంకూదిన' ట్లయ్యెను. తదాదిగ రహస్య రక్షక భటులు నిరంతరము మహాత్ముని వెంటనంట సాగిరి.

పిమ్మట చాంపరాను మండలమున కర్షకులకును

ప్రభుత్వమునకును నొక సంఘర్షణ సంభవిల్లనచటను మహాత్ముఁడమోఘమగు తన సత్యాగ్రహాయుధమునే ప్రయోగించి తద్ద్వారా విజయము గాంచఁ గలిగెను. అటనుండి మహాత్ముఁడు కైరామండలమునకుఁబోయి యచటి కర్షకులను దుర్భర దారిద్ర్యమునుండి యుద్ధరింప సమకట్టెను. అటఁ బంటలు లేకున్నను రైతులు పన్నులు గట్టవలసి వచ్చెను. రైతులొక మిది యన్యాయమని పన్నులు గట్టఁ దిరస్కరించెను. మహాత్ముఁడచటికేగి ప్రభుత్వముతో నెట్లో యొక యొడంబడిక కుదుర్చుకొని యా యుద్యమమును ముగించెను. దీనితో మహాత్ముని మహాప్రభావము, పలుకు బడియు జగద్విదితములై యాతని ప్రసిద్ధి దశదిశావ్యాప్త మయ్యెను. ఆతఁడైచ్ఛికదళ సేకరణ విషయమున రాజ ప్రతినిధికి సాయమొనర్చి యాతని మెప్పువడసెను. ఎడతెఱపి లేని యిట్టి కార్యక్రమము కతమున దుర్బలమగు మహాత్ముని శరీరము మరల నొకసారి రుగ్మత పాలయ్యెను. కాని భిషగ్వరు లెంత ప్రార్థించినను నాతఁడు పాలుత్రాగ నిచ్చగింపఁడయ్యెను. వెజ్జు లాతని తుదకు మేకపాలైనఁ బుచ్చుకొనుమని నిర్బంధింప నెట్టకేల కనిష్టముగనే దాని కియ్యకొని యామరణాంతము మేఁకపాలతోడనే కడపెను. కాని యదియు నకార్యకరణమనియే యాతని యభిప్రాయము. మున్నాతఁడు దక్షిణాఫ్రికాయందున్న సమయమున గోమాతల హైన్యమును జూచి గోక్షీరముల గ్రోలనని శపథ

మొనర్చెను.

మహాత్ముని శాసనధిక్కారాయుధ ప్రయోగము భారత దేశమున రౌలటుచట్టముతోఁ బ్రారంభమయ్యెను. దీనికై ప్రప్రథమమున నఖిలభారతావనియందు హర్తాలు జరుపఁబడెను. ప్రభుత్వమునకు వెఱ్ఱెత్తి నిర్బంధచర్య లవలంబింప సాగెను. ప్రజలు కోపోద్దీపితులై మహాత్ముని సిద్ధాంతమునకు విరుద్ధముగ నచటనచట హింసాపద్ధతు లవలంబించిరి. దీనికిఁ బ్రతీకారముగ సైనిక శాసన మమలుపఱుపఁబడెను. అశ్రుత పూర్వములును ఘోరాతి ఘోరములు నగు జలియన్ వాలా హత్యలు జరిగెను. మహాత్మునిఁ బంజాబు పోవలదని నిర్బంధించిరి. ప్రజల ప్రతీకార చర్యలను హింసాకాండను జూచి మహాత్ముఁ డుద్యమము నాపెను. ప్రజలాశాభంగము నొందిరి. ఈసంఘటనల వలన మహాత్ముని రాజభక్తి యించుక సడలెను.

మహాత్ముని నిర్మాణ కార్యక్రమమునందు హిందూ మహమ్మదీయ సఖ్యము ముఖ్యమైనది. దీనికై యతఁడు నిరంతరకృషి సలిపి మతసహనాభావ కారణమునఁ జెలరేగు హత్యాకాండములకై మరణించువరకు నుపవాస చర్యల నవలంబించెడివాఁడు. తుదకు తన ప్రాణములఁ గూడ నీ సమస్యకొఱకే యర్పించెను. కాని పాషండ హృదయులకు జాలి యెక్కడిది! 'నెమిలికంట నీరు కారిన వేఁటకానికి ముద్దా!' ఇప్పటికిని హింసాదేవత దేశమునఁ బలుచోటులఁ

దాండవించు చున్నది. ఇప్పటికిని మతముపేరిట నెన్నియో యమానుష చర్యలు జరిగి దేశము రక్తప్లావిత మగుచున్నది. ఇయ్యది సంస్కరింపఁబడు దనుక దేశమాతకుఁ దరణోపాయము లేదని మహాత్ముని నిశ్చితాభిప్రాయమై యుండెడిది. ఇట్టి ఘోరహింసలు, మతోన్మాదములు, మహాత్మునకు హృదయశల్యములుగ నుండెను. దీనితోడనే మహాత్ముని మనము పరిపరివిధములఁ బరితపించెను. తొలుదొల్త మహాత్ముఁడు 'ఖిలాఫతు' ఉద్యమమున కెంతయో సాయమొనర్చి యాలీ సోదరుల నిర్బంధ విముక్తికై తన యావచ్ఛక్తిని వినియోగించెను.

మహాత్ముని నిర్మాణ కార్యక్రమమునందు ఖాదీ యుద్యమము మఱియొక ప్రధానాంశము. రాట్నము, ఖద్దరు వానికిఁ బ్రాణతుల్యములు. దీనికై దేశీయ మహాసభాంగముగ నఖిలభారత చరకాసంఘ శాఖ నొకదానిని నిర్మించి ఖద్దరు వ్యాప్తికై నిరంతర కృషి సల్పెను. విదేశ వస్త్రములనిన నతని కేవగింపు. మొదట విదేశవస్త్ర దహనమును బ్రచారముచేసి వేల్సు యువరాజు మన దేశమునకు వచ్చినప్పుడాతని సమక్షముననే యిట్టి దహన సంస్కారమును బ్రదర్శించి విదేశవస్త్రములయెడఁ దనకుగల విముఖతను జాటించెను.

స్వరాజ్య సంపాదనాందోళమునకై మహాత్ముఁడు నిరూపించిన కార్యక్రమమునందు మద్యపాన నిషేధము

మఱియొక ప్రధానాంశము. మద్యపాన దురభ్యాసమున ప్రజాలోకమునకుఁ గలుగు చెడుగుల ననేకవిధముల బోధించి కార్మిక కర్షకావళియందీ దుర్వ్యసనమును మాన్ప గొప్ప ప్రచార మొనరించెను. దీని ఫలితముగనే మనరాష్ట్రమునం దిపుడు ప్రజాప్రభుత్వ మున్న మండలములందు మద్యపాన నిషేధ చట్టము నమలుపఱుచుచున్నది.

మహాత్ముని దేశహిత కార్యక్రమమునందు హరిజన సమస్య యవశ్యాదరణీయమగు ప్రధానాంశము. అస్పృశ్యతా పిశాచమును బాఱఁద్రోలుట కాతఁ డొనర్చిన కృషి యద్వితీయము – అనన్యము – అసామాన్యము. ఇట్టి కృషి మఱి యే యుద్యమమునందును నాతఁడు జేసియుండలేదు. ఏకోదరులగు మానవుల వేఱుపఱచి యంటరాని వారని దూరముగ నుంచుట పైశాచిక కృత్య మనియు నట్టి మనకుఁ బాశ్చాత్యులతోడి సమాన ప్రతిపత్తిఁ గోరుటకుఁ గాని స్వాతంత్ర్యము నభిలషించుటకుఁ గాని యర్హత లేదనియు ఖండితముగఁ బెక్కుసారులు నొక్కి వక్కాణించెను. జాతీయ మహాసభాసంబంధి మూలద్రవ్యమునుండి యాతఁ డీ సమస్యకై కోటాను కోట్ల రూప్యముల వెచ్చించెను. అస్పృశ్యతా నివారణ యాచరణసాధ్యము కాకపోదని నిరూపించుటకై యాతఁ డొక మతంగకన్యను బెంచి యామెకు విద్యా బుద్ధులు గఱపి యుచ్ఛస్థితికిఁ దే నిశ్చయించెను. అనన్య సాధ్యమగు నాతని కృషిఫలితముగ నస్పృశ్యతా పిశాచము

కొంతదవ్వు పాఱఁద్రోలఁబడినది. కాని యీవిషయమున నింకను శ్రమపడవలసి యున్నది. దైనందినముగ నేఁడు జరుగుచున్న హరిజన దేవాలయ ప్రవేశముల కాతని తీవ్ర కృషియే కారణము గాని వేఱొండు గలదా!

ఇట్టి కార్యక్రమము ననుసరించి మహాత్ముఁడు స్వాతంత్ర్య సంపాదనకై 1920-వ సంవత్సరమున సహాయ నిరాకరణోద్యమమును బ్రారంభించెను. ఇయ్యది దౌర్జన్య రాహిత్య మను విషయము మనము మఱవరాదు. విద్యార్థులను బాఠశాలల వీడి బయటికి రండనెను. న్యాయవాదుల న్యాయస్థానముల విసర్జింపుఁడనెను. ప్రభుత్వోద్యోగులను దమ దమ స్థానముల ఖాళీచేయుఁడనెను. శాసనసభ్యులను శాసనసభాభవనములఁ ద్యజించి ప్రభుత్వ పరిపాలనా కార్యక్రమమును స్తంభింపఁ జేయుఁడనెను. గ్రామోద్యోగీయులఁ దమ తమ పదవులకు రాజీనామా లొసంగుడనెను. తుదకుఁ బన్నుల నిరాకరణోద్యమమును గూడ నుపక్రమించెను. దేశీయు లనేకు లీయాజ్ఞను శిరసావహించి నడుములు బిగించి రణరంగమున కుఱికిరి. కాని దేశమందచటనచట సంభవించిన సత్యాగ్రహోద్యమ విలంఘనమును గాంచి ప్రజ లింకను సుశిక్షితులు గాలేదని గ్రహించి మహాత్ముఁడు వెనువెంటనే తన సహాయనిరాకరణాస్త్రము నుపసంహరించెను. ఈ నిశాతాస్త్ర ప్రయోగోప సంహరణ విధానము మహాత్మునకుఁ దెలిసినట్లు మఱియొకరికి దెలియునా? ప్రజలయందలి నైతిక

ప్రవర్తనకుఁ గల లోపమునకుఁ దానే కారకుఁడ నని యెంచి యందులకుఁ బ్రాయశ్చిత్త మొనరించుకొనఁదలఁచి సబర్మ త్యాశ్రమమున నంతరాత్మ ప్రబోధించుట కతన గఠోరోప వాస దీక్షఁ గైకొనెను. అంతరాత్మ ప్రేరేపణ వలన నిట్లెన్ని యోమారు లుపవాసదీక్షయుఁ బ్రాయోపవేశమును బూనుటం జేసి యాతని బడుగు దేహ మింకను బక్క చిక్క సాగెను. తన జీవితకాలమునందు విశేషభాగము కారాగార వాసప్రాప్తిఁ బొందుటకతన శరీరారోగ్యము నించుక కోల్పో యెను. ఇది యంతయు జేసినది మాతృదాస్య విమోచన మున కేకదా! మొదటిసారి భారతదేశమున నాతని కాఱు వత్సరములు కారాగార శిక్ష విధింపఁబడెను. అయ్యెదనున నాతఁడు విచారణసమయమునఁ దన సత్యాగ్రహ సిద్ధాంత ములఁ గూర్చి విపుల మహోపన్యాసము గావించెను. న్యాయ స్థాన మా సిద్ధాంతములందలి మహాత్కృష్ట్యమును బవిత్రత నంగీకరించెను. కాని యయ్యవి న్యాయశాస్త్ర సమ్మతములు గామి మహాత్మునకు కారాగార వాసము దప్పదయ్యెను.

ఎఱవాడ చెఱసాలయం దాతఁడు శిక్ష ననుభవించు చున్నతఱి వ్యాధిగ్రస్తుఁడై వైద్యశాలయందు శస్త్ర చికిత్స గాంచెను. ఆనాఁడు భారతావనియం దాబాలగోపాలము ప్రాణము లఱచేత నిడికొని యమూల్యమగు మహాత్ముని ప్రాణదానమునకై పరాత్పరుని బదింబది హృదయపూర్వక ముగఁ బ్రార్థించిరి. భగవదనుగ్రహము వలన మహాత్ముఁ

డచిరకాలమునఁ గోలుకొని తన యారోగ్య విషయమున గడుంగడు శ్రద్ధనహించిన ప్రభుత్వమునకుఁ దన కృతజ్ఞత వెల్లడించెను.

కాలక్రమమున సైమనుసంఘము నియమింపఁబడి భారత దేశమునకు రాఁగా మహాత్ముని యాదేశానుసారము భారత ప్రజానీక మంతయు నద్దాని బహిష్కృత మొనరించెను. ఏతత్సంఘునివేదిక ననుసరించి ఇంగ్లాండున రౌండు టేబిలు సమావేశ మేర్పఱుపఁబడి భారత దేశమున కేకైక నాయకుఁడగు మహాత్ముఁ డాహూతుఁ డయ్యెను. దేశీయ మహాసభా పక్షమున నాతఁ డటకేగి యీారికలెత్తు భారతీయుల కోరికలఁ గొనసాగింపకుండుట కయితి గాదనియు నట్లు నెరవేర్పకున్న దేశీయమహాసభ శాసన తిరస్కారోద్యమమును తిరిగి యవలంబించు ననియు మొగమోటమి వీడి ఖండితముగ నొక్కి వక్కాణించెను.

తదనుసారముగ మహాత్ముఁ డీయుద్యమమును మరల 1930-వ సంవత్సరమున లేవనెత్తెను. దీని కుప్పుసత్యాగ్రహమని నామకరణమిడి తన యుద్దేశ్యమును మున్ముందుగ రాజప్రతినిధి కెఱుకపఱచెను. కొంతమంది యనుచరులతోఁ గూడి దండి సముద్రతీరమునకు సత్యాన్వేషణార్థియై బయలుదేరెను. దారిపొడవునను జానపదులకు సత్యాగ్రహోద్యమతత్త్వము నుద్బోధించుచు దౌర్జన్యరహిత సహాయ నిరాకరణోద్యమమునందుఁ బాల్గొనుఁ డని హెచ్చరించుచుఁ దన

పయనము సాగించెను. త్రోవయందు జనులు తండోప తండములుగ నీ యాత్రయందుఁ జేరి యీ సదుద్యమము సఫలీకృత మగుఁగాత యని యాశీర్వదించుచుఁ దాముును నందు బాల్గొనిరి. ఈదండీదండయాత్ర యెట్టి పరిణామముగావించునో యెట్టి సత్ఫలితము నందునో యని ప్రపంచమంతయు త దేక దృష్టితో నిరీక్షింప సాగెను. మహాత్ముండు దండిని జేరుట కొక్క మాసము పట్టెను. అట మహాత్ముఁడు లాంఛనముగఁ గొలఁది యుప్పుకణముల నెత్తి ప్రప్రథమమున తానే చట్ట ధిక్కార మొనర్చెను. వెంటనే యుప్పుసత్యాగ్రహము దేశమం దన్ని పార్శ్వముల దావపావకునివలె వ్యాపించెను. అనతికాలమున దర్శి యుప్పుకొఠారుల ముట్టడింతునని మన సత్యాగ్రహ సమర సేనానాయకుఁడు ప్రకటించెను. ఈ ప్రకటనఁ గాంచి ప్రభుత్వ ముట్టునాతలూగి బ్రిటిషు సౌధము పునాదులు గదలు నెత్తు వచ్చెనని యాముట్టడి నరికట్టుటకై సేనాధ్యక్షుఁడగు మహాత్మునిఁ గాలనియమము లేకయే కారాగారమునం దుంచిరి. అందులకు భారతదేశమంతయు నట్టుడికిన ట్టుడికి యసమ్మతి సూచకముగ హర్తాలొనరించెను. తదాది దేశమునందు మరల నొకసారి నిర్బంధ విధానము పెచ్చుపెఱిగి కారాగారము లన్నియు దేశభక్తులగు ప్రజలచే నిండి నిబిడీకృతము లయ్యెను. అంతట ప్రభుత్వమువారు సేయునదిలేక మహాత్మునితో 'గాంధి - ఇర్విన్' ఒడంబడికను జేసికొనిరి. ఈ యొడంబడిక ప్రకా

రము మహాత్ముఁడు తన యమోఘాస్త్రము నుపసంహరించు నట్లును, ప్రభుత్వము నిర్బంధవిధానమునకు దిలోదకము నిచ్చునట్లు నంగీకృత మయ్యెను.

పిమ్మట నాలు మాసములకు మరల మహాత్ముని రౌండు టేబిలు సమావేశమున కాహ్వానించిరి. కాని యయ్యది మహాత్మునిఁ దృప్తిపఱుప దయ్యెను. మహాత్ముఁ డెన్ని సారులు సీమ కేగినను దన కటివస్త్రము నాకు చెప్పులతోడనే కాని పాశ్చాత్య వేషము గైకొనఁడయ్యెను. శీతవాతాతప ముల కతీతుఁడు గాన దిగంబరమగు నా బడుగు దేహము తోడనే యతిశీతలమగు నా దేశమున సైతము సంచరించుట గాంచి పాశ్చాత్యులు ముక్కుపై వ్రేలిడుకొని యాతఁడు దైవాంశసంభూతుఁ డని యంగీకరించిరి.

గాంధి – ఇర్విన్ ఒడంబడికను ప్రభుత్వమువారు భగ్న మొనరించి మరల నిర్బంధవిధానము ననుగమింపసాగిరి. ఇంతలో రాజప్రతినిధి మారి నూతనముగ నేతెంచిన రాజ ప్రతినిధి ఈ సమస్యాపరిష్కారమునకై యత్నించి విఫలమనో రథుఁ డయ్యెను. మరల నొకసారి మహాత్ముని విచారణ లేకయే యెఱవాడ చెఱసాలయందు నిర్బంధించిరి. నిర్బంధ విధాన మమలుపఱచిన కొలఁదిని ప్రజలు ద్విగుణీకృతో త్సాహముతో నుద్యమము దృఢీకృతము కావింపసాగిరి. కమ్యూనల్ ఎవార్డున కసమ్మతి సూచకముగ మహాత్ముఁడు చెఱసాలయందే నిరశనవ్రత మారంభింపఁ బ్రభుత్వమువా

రాతనిని మరల విముక్తునిఁ గావించిరి.

1935-వ సంవత్సరమున దేశీయ మహాసభాదేశాను సారముగ నాయకులు పదవీస్వీకరణ మొనర్చి పెక్కు రాష్ట్రములందు స్వపరిపాలన సాగించిరి. కాని 1941-వ సంవత్సరమున నొకసారియు, 1942-వ సంవత్సరమున నింకొక సారియు మరల నుద్యమము తలయెత్తుటయు మరల నిర్బంధ ములు చెలరేగుటయుఁ దటస్థించెను. ఇట్లు పెక్కుసారులు మహాత్ముని యాజమాన్యమున నీ సత్యాగ్రహయుద్ధ ప్రయో గోప సంహరణలు జరిగి యెట్టకేలకు ప్రభుత్వమువారు 1947 ఆగష్టు పదునాల్గవ తేది యర్ధరాత్రమున భారతావనికి స్వాతంత్ర్య ప్రదాన మొనర్చిరి. ఆ నాఁడా సేతుశీతనగము నగరనగరమునను బల్లెపల్లెను స్వాతంత్ర్యదినోత్సవము మిగుల నుత్సాహముగ జరుపఁబడి మహాత్ముని నామ స్మరణముతో దిక్కులు పిక్కటిల్లి స్వాతంత్ర్య పతాకము నిరాఘాటముగ నెగుర నారంభించెను. ప్రభుత్వ భవనములపై సైతము యూనియను జాకు స్థానమున జాతీయ పతాకము తెపతెప గొట్టుకొనసాగెను.

మహాత్ముఁ డిట్లు తన మాహాత్మ్యముచేతను సత్యా హింసలనెడి సాధనములచేతను నొక్క రక్తకణమైన జింద కుండ జిరకాల వాంఛితమగు స్వాతంత్ర్యమును గడింప గలిగెను. ఇట్టి సంఘటన ప్రపంచ చరిత్రమునం దశ్రుత పూర్వము. యుద్ధములు లేకయే కత్తులు కఠారులు మొదలగు

యుద్ధపరికరములు లేకయే స్వాతంత్ర్య మార్జించిన దేశము ప్రపంచమునం దెచ్చటను గాంచము. సత్యాన్వేషణ తత్పరత గాని, యహింసా తత్త్వముగాని తుదిఘడియ వఱకును మహాత్ముని కార్యదీక్షగాని యించుకేనియు మొక్కవోవ లేదు. ఆతఁడు హింసాకాండ మాన్పుటకై గ్రామైక రాత్రముగ దిరుగుచు శక్తివంచన లేక ప్రజలకు శాంతి సిద్ధాంతము నుద్బోధించుచు మతావేశ పిశాచమును రూపుమాపి మారణహోమము జేయ సమకట్టెను. కావుటం జేసియే ఈ మహానుభావుని నేటికిని భారతీయులు పితృతుల్యునిగను, దైవసమానునిగను బూజించుచున్నారు. విదేశస్థులును నేనాటికైన మహాత్ముని శాంతి సందేశమే ప్రపంచము నుద్ధరింపగలదని యాశించుచున్నారు. భారత ప్రసిద్ధిని బ్రపంచమునకుఁ జాటి భారతౌన్నత్యమును దశదిశావ్యాప్త మొనర్చిన మన మహాత్ముని యాత్మకు దయామయుఁడగు పరాత్పరుఁడు శాంతి నిచ్చుగాత మని మనము నిరంతరము ప్రార్థింతము. మహాత్ముఁడు ధన్యజీవియే కాని మతోన్మాదమున నాతని బలిగొని మానవజాతియే తీరని కళంకము సంపాదించికొనెను.

# నేతాజీ

మన భారత ఖనియం దమూల్యములగు రత్నము లెన్నియేని గలవు. అందు సుభాషుచంద్రబో సనసామాన్య నాయక రత్నము. సానలుదీరిన జాతిరత్నము. సుభాషు బాబు స్ఫురద్రూపి. చంద్రమండలముం బోలు గుండ్రని ముఖము, విశాలమైన నుదురు, శౌర్య ప్రకటితములగు నేత్రములు, కోటేరువంటి ముక్కు, అందుపై నలంకారప్రాయము లగు సులోచనములు నాతఁడు సుందరాకారుఁ డని చెప్పక చెప్పును. ఆతని ముఖమండలమున మందహాసరోచులు నిరంతరము తాండవమాడుచుండును. ఆజానుబాహుఁడగు నాతఁడు తెల్లని ఖద్దరు వస్త్రములు ధరించిన నెంత చూడ ముచ్చటగ నుండునో సైనిక దుస్తులు ధరించినను నంత నయనానందకరముగ నుండును. ఈ నాయకాగ్రణికి విజ్ఞానము, సత్ప్రవర్తనము, సౌశీల్యము, మతాభినివేశము, కార్యదీక్ష పెట్టని యలంకారములు. రవి యస్తమింపని సామ్రాజ్యాధినేతలను గూడ నీతఁడు తన తీవ్రవాదముచే నల్లకల్లోల మూగించి, కొఱకరాని కొయ్యయు మ్రింగరాని మాత్రయు నయ్యెను. ఈతనికి భయపడినట్లు మన ప్రభుత్వము వారే నాయకునకు భయపడి యుండరు. ప్రభుత్వసేవ నిచ్ఛగించి యుండినయెడల ఐ. సి. యస్. పరీక్షయం దుత్తీర్ణుఁడైన ఈ మేధావి యే మండలకరగ్రాహియో యై యుండవలసినది.

కాని ప్రజాసేవయే ప్రధానముగ నెంచిన ఈ త్యాగి యద్దానిఁ గాలఁదన్ని దేశమాతృ దాస్యశృంఖలా విచ్ఛేదన మునకే తన జీవిత మంకిత మొనర్చి బలిగొనసంగెను. తన జీవితమున విశేష భాగము కారాగార మందును విదేశము లందును గడిపి తుదకు దేశమాతకొఱకుఁ బ్రాణము లర్పించిన ఈ నిష్కళంక దేశభక్తుని చరిత్ర మవశ్య పఠనీయము.

శ్రీ రామకృష్ణపరమహంస శ్రీ వివేకానందస్వామి మున్నగు పరివ్రాజకోత్తములును, రాజా రామమోహన రాయి వంటి సంస్కర్తలును, సురేంద్రనాథ బెనర్జీ, చిత్తరంజన దాసు మున్నగు దేశసేవాపరాయణులును, జగదీశ చంద్ర బోసు, పి. సి. రే లోనగు విజ్ఞాన శాస్త్రవేత్తలును జన్మించిన వంగరాష్ట్రమే మన బోసుబాబునకు జన్మస్థానము.

సుభాషుబాబు సుప్రసిద్ధ కాయస్థకులజుఁడు. తండ్రి జానకినాథబోసు. తల్లి ప్రభావతీదేవి. ఈ పుణ్యదంపతులకుఁ బదముగ్గురు సంతానము. అందు న్యాయవాది శ్రేష్ఠుఁడగు శరత్ చంద్రబోసు, భిషగ్రత్నమగు సునీల చంద్రబోసు, నాయకోత్తముఁ డగు సుభాషుచంద్రబోసు ప్రముఖులు.

ఒరిస్సా రాష్ట్రమున జానకినాథబోసు ప్రభుత్వ న్యాయ వాదిగ నున్నపుడు మన నేతాజీ జన్మించెను. జానకినాథ బోసు తన సంతానమున కత్యంత శ్రద్ధతో విద్యాబుద్ధులు గఱపి వారి బాల్యమునం దేలోపమును రానీక కంటిని ఱెప్పవోలెఁ గాపాడుచు నాదర్శజనకుఁ డనిపించుకొనెను.

ఈతఁడు కేవలము న్యాయవాదవృత్తి నవలంబించుటయే కాక, పెక్కు ప్రజాహితోద్యమములందుఁ బాల్గొని మానవ సేవ యొనర్చెను. 'అవశ్యం పిత్రాచార' మనినట్లు పుత్రు లును నా మార్గమే యవలంబించిరి.

జనకు నుద్యోగస్థానమగు కటకమునందే బోసుబాబు నకు విద్యారంభ మయ్యెను. ఈతఁ డత్యంత శ్రద్ధాభక్తులతో విద్య నభ్యసించి ప్రతి తరగతి యందును బ్రథముఁడుగ నుత్తీర్ణుఁ డయ్యెను. కటకమునందే ప్రవేశ పరీక్షయందు నగ్రగణ్యముగఁ గృతార్థుఁ డయ్యెను. ఈతఁడు కేవలము పాఠ్యపుస్తకములతోడనే నిరంతరము సతమతముగాక వ్యాయామమును సంఘసేవ మున్నగు సద్విషయములందుఁ బాల్గొనెడివాఁడు. బాల్యముననే శ్రీరామకృష్ణ పరమహంస తత్త్వోపదేశము లీయన మనము నాకర్షించెను. తత్త్వ శాస్త్రమే తన యభిమాన విద్యగఁ బట్టబరీక్షయందును బ్రథముఁడుగ నారితేరెను. కళాశాల విద్య గడించు సమయ మున నధ్యాపకుఁ డొకప్పుడు వంగరాష్ట్రవాసుల నిందింప నీతఁడు తోడి విద్యార్థులతో సమ్మె సాగించెను. తత్ఫలిత ముగ నాతఁడు రెండు సంవత్సరములే కళాశాలయందు జదువరాదను నాంక్షకు గుఱియై తన యాత్మగౌరవమును బ్రదర్శించెను.

తల్లియగు ప్రభావతి దైవభక్తి మతాభినివేశముగల వనితగాన మన బోసుబాబునకు మతకాంక్ష యుగ్గుబాల

తోడనే యలవడెను. కాఁగా నాతఁడు పెక్కు మతగ్రంథ ములఁ బఠించి యనేక మతోపదేశముల సావధానముగఁ జర్చించి తుదకు దనకుఁ దగిన మతోపదేశికుని కొఱకై యన్వేషింప మొదలిడెను. అది కారణముగ నాతఁ డొక యర్ధరాత్రమున నకస్మాత్తుగ నిల్లువదలి వెడలిపోయెను. తలిదండ్రు లాతనిజాడఁ బొడగానక వెదకి వెదకి విసిగి వేసారిరి. ఈతఁడు గయ, ప్రయాగ, వారణాసి, హరి ద్వారము మున్నగు పుణ్యక్షేత్రముల మెట్టి గుర్వన్వేషణ సాగించెను. కాని ఫలితము లేదయ్యెను. నిరాశాపూరితుఁ డగు నేతాజీ యీ యాత్రయం దాహార నిద్రలు లేక కుందు చుండ నొక యుదారమనస్కుఁ డద్దాని గ్రహించి యాతని తండ్రికిఁ దంత్రీవార్త నంపెను. జనకుఁడును బెన్నిధిఁ గాంచిన పేదవోలె నపరిమితానంద కందళిత హృదయుఁడై యటకేగి కుమారు నింటికి దోడి తెచ్చెను. మరల బోసుబాబు చదువు నంతల సాగించి విద్యార్థిదశయందే మిలిటరీ శిక్షణ నందెను. జగద్విఖ్యాతి గాంచిన నజాదు హిందూఫౌజున కీ శిక్షణమే బీజము. ఇచటఁ బట్టపరీక్షయందు త్తీర్ణుఁడై ఐ. సి. యస్. చదువుటకై ఇంగ్లాండున కేగి తొలుత కేంబ్రిడ్జి విశ్వవిద్యా లయమున మరలఁ బట్టపరీక్షయందు త్తీర్ణుఁ డయ్యెను. పిమ్మట ఐ. సి. యస్. పరీక్షయందు నాల్గవ వాఁడుగఁ గృతార్థుఁడై వ్యాసరచనా విషయమునఁ బ్రథమగణ్యుఁ డయ్యెను. అంత విదేశ విద్యకు నాశ్వాసాంతము చెప్పి బోసుబాబు

గృహోన్ముఖుఁ డయ్యెను.

బోసుబాబు బొంబాయిరేవులో భారత భూమిపై నడుగు వెట్టుసరికి మన దేశమున సనహాయోద్యమము వీరవిహార మొనర్చుచుండెను. రౌలటు చట్టము, జలియన్ వాలాబాగు హత్యలు, మార్షలు లా మొదలగు సవాంతరములు పెచ్చు పెరిగెను. మోతీలాలు, చిత్తరంజనదాసు మున్నగు నాయకోత్తములు శాసనసభా బహిష్కార మొనర్చిరి. దేశనాయకు లందరు కారాగారము లలంకరించిరి. అమాయక ప్రజలు చాలమంది ప్రభుత్వ దౌర్జన్యములకు గుఱియై యసువులఁ బాసిరి.

ఇట్టి దుర్భర పరిస్థితు లన్నిటిని కన్నులార గాంచియు చెవులార వినియు మన బోసుబాబు వేడిరక్త ముష్ణింగకుండునా! తత్క్షణమే తన ఐ. సి. యస్. పట్టమును విసర్జించి 'సిరిరా మోకాలొడ్డి'న రానున్న కలెక్టరుపదవిఁ గాలఁదన్నెను. వెంటనే మహాత్ముని సన్నిధానమున కేగి 'యేమి సెల'వని యడిగెను. ఆతఁడు సుభాషునిఁ జిత్తరంజనదాసునొద్ద కంపెను. ఆతఁ డీతనిని తన యనుయాయు వర్గమునందు జేర్చుకొనెను. నాఁటినుండి చిత్తరంజనుఁడు బోసుబాబు చిత్తము రంజింపఁగల రాజకీయ గురువయ్యెను. ప్రప్రథమమున బోసుబాబు చిత్తరంజనునిచే స్థాపింపఁ బడిన జాతీయ కళాశాల కధ్యక్షుఁ డయ్యెను. పిమ్మట జాతీయ స్వచ్ఛంద సేవాదళాధిపతిగ నియమితుఁ డయ్యెను. వేల్సు యువరాజు

రాక కసమ్మతి సూచకముగ కలకత్తాయందుఁ జేయఁబడిన హర్తాలునకు మన నేతాజీయే కార్యకర్త. ఈతని యాజమాన్యమున హర్తా లత్యంత జయప్రదముగఁ గొనసాగి యాతఁడు ప్రభుత్వాగ్రహామునకు గుఱియయ్యెను. ఆరు మాసములు కారాగార శిక్ష విధింపఁబడెను.

పిమ్మట శాసనసభా ప్రవేశము నామోదించుచుఁ జిత్తరంజనాదులు స్వరాజ్యపార్టీ స్థాపించిరి. దానికి సుభాషు పబ్లిసిటీ ఆఫీసరుగ నియమితుఁడయ్యెను. పిమ్మటఁ గొంతకాలమునకు వంగదేశము వరదలలో మునిఁగి ప్రజ లన్నవస్త్రములు గాని, తలదాచుకొనఁదగు నెలవుగాని లేక పెక్కుడుమలఁ గుడువవలసి వచ్చెను. ఆ సమయమున నేతాజీ వరదల సహాయ సంఘమునకు ప్రధాన కార్యదర్శియై యొనర్చిన మానవసేవయు సంఘసేవయు నద్వితీయములు. దేశనాయకులును రాజప్రతినిధియు నీ సేవను వేనోళ్ళఁ బొగడిరి.

చిత్తరంజన స్థాపితమగు నాంగ్లదినపత్రికకు బోసుబాబు సంపాదకుఁడయ్యెను. స్వరాజ్యపార్టీబలము దేశమునం దెక్కుడయ్యెను. కలకత్తా కార్పొరేషను స్వరాజ్యపార్టీ యధీనమై చిత్తరంజనుఁడు మేయరును, సుభాషు కమీషనరు నైరి. స్వరాజ్యపార్టీ బలమును జూచి ప్రభుత్వమునకుఁ గన్నుగుట్టి యుద్యానినిఁ జెదరఁగొట్ట సంకల్పించిరి. విచారణ లేకయే నాయకులందఱు బందీకృతులైరి. అందు బోసుబాబు ప్రథముఁడు. ఈతనిని మొదట నాలీపురము చెఱసాలయం దుంచి

కొండొక కాలమునకు బ్రహ్మపుర కారాగారమునకు మార్చిరి. ఇట్లు నిరంతరము కారాగారా వాసమున నుండుటవల్లను నెడతెగని మార్పులవల్లను నాతని యారోగ్యము పూర్తిగ శిథిలమయ్యెను. తత్కారణమున ననతికాలమున శయ్యాగతుఁ డయ్యెను. ఇట్టి స్థితియందే ప్రభుత్వమువా రాతనిని రంగూను పరిసరముల నున్న 'ఇనుసీను'నకు మార్చిరి. దీనితో నాతని వ్యాధి యినుమడించెను.

'గోరుచుట్టుపై రోకటిపోట' నిన ట్లింతలో నాతని రాజకీయగురువు చిత్తరంజనుఁ డస్తగతుఁ డయ్యెను. బోసుబాబింకను గ్రుంగి కృశించెను. ఆతనిని వెంటనే విడుదల చేయుఁడని ప్రజ లేకగ్రీవముగ విన్నవించిరి. కాని కఠిన హృదయులగు ప్రభుత్వమువా రట్లు సలుపక పరీక్షార్థ మొక వైద్యసంఘము నియమించిరి. ఆతఁడిచ్ఛగించిన నారోగ్యార్థము స్వంతఖర్చులపై యూరపున కేగవచ్చునుగాని, యింటి ముఖము చూడరాదని ప్రభుత్వము శాసించెను. కాని, యాత్మగౌరవ ప్రపూరితుఁడగు నేతాజీ చెఱసాలయందే యసువులఁబాయు టుత్తమమని యెంచి యెటకును బో నిచ్ఛగింపఁ డయ్యెను.

అంతట బ్రభుత్వమువా రటనుండి బోసుబాబును 'ఆలోరా' చెఱసాలకు మార్చిరి. ఈ మార్పువలన బోసుబాబు ఆరోగ్యము ప్రాణసంశయ స్థితికి వచ్చెను. శరీరము శల్యావశిష్ట మయ్యెను. అప్పుడుగాని ప్రభుత్వమువా

శాతనిని విడుదల చేయవైరెరి. ఇట్టి జాలిమాలిన నమానుష కార్యము ప్రభుత్వమువారి పిరికితనమునే సూచించునుగాని యన్యము కాదని మహాత్ముఁడు ప్రకటించెను. విచారణ చేసియే బోసుబాబును జెఱయం దుంచితిమని యిండియా మంత్రి పార్లమెంటున కెఱుకపఱచెను. అయ్యది ఘోరాసత్య మని యట్టి జబ్బుస్థితిలోనే నేతాజీ దీర్ఘప్రకటన మొకటి గావించెను. కార్యదీక్షయం దభిరుచివలన నేతాజీ తన యారోగ్యము నెట్లు సరకుసేయఁడో యాతనిపై రనినఁ బ్రభుత్వమున కెంత సింహస్వప్నమో యూహింపుఁడు.

దైవానుగ్రహమున నారోగ్యము కొంచెము కుదుట పడఁగనే బోసుబాబు మరల రాజకీయరంగమున కుఱుక నడుము బిగించెను. కాని దురదృష్టవశమున వంగరాష్ట్ర దేశీయ మహాసభా శాఖయందు రెండుపక్షము లేర్పడెను. అందొకదానికి నేతాజీ యధినేత. రెండవదానికి సేనుగుప్త నాయకుఁడు. ఒకరు 'ఫార్వర్డు' పత్రికను, మరియొకరు 'అడ్వాన్సు' పత్రికను నడిపి యీద్వైవిధ్యము మఱింత పెచ్చు పెఱుగున ట్లొనర్చిరి. కార్పొరేషను మేయరుపదవికి సేను గుప్త పోటీచేయకుండ విరమించెను. కాని బోసుబాబునకు సాయము చేయఁడయ్యెను. 'పిట్టలపోరు పిల్లిదీర్చిన' ట్లా పదవి మరియొకరు తన్నుకొని పోయిరి. బోసుబాబునకు పదవీ వ్యామోహ మిసుమంతయు లేదుగాన నీ యపజయ మున కాతని కావంతయు వంత లేదయ్యెను. కొంతకాలము

నకు సుభాషు కార్పొరేషను మేయరును, వంగరాష్ట్ర కాంగ్రెసు సంఘాధ్యక్షుఁడు నయ్యెను ; గాని వైషమ్యములు మరింత తీవ్రరూపము దాల్చెను. పిదప బోసుబాబు కొన్ని వత్సరము లఖిలభారత కార్మిక సంఘాధ్యక్ష పదవి నలంకరించి యీ సంఘమునకు గొప్ప సేవ యొనర్చెను.

చెఱసాలయం దున్నపుడే యాతఁడు వంగరాష్ట్ర శాసనసభ్యుఁడుగా నెన్నుకొనఁబడెను. కాని గురువగు చిత్తరంజనుని మరణానంతరము బోసునకు శాసనసభలందలి మక్కువ తక్కువయ్యెను. అది కారణముగ నాతఁడు తన మనమును నిర్మాణకార్యక్రమమునకుఁ ద్రిప్పెను. ఖద్ద రుద్యమము, స్వదేశీ యుద్యమము, కళాశాలా సమాజ నిర్మాణోద్యమము మున్నగు దేశహితోద్యమములందుఁ గృషి యొనర్పసాగెను. ఇందువలన బోసుబాబుపైఁ బ్రజల కాదరమును, బ్రభుత్వమునకు నిరాదరణమును మెండయ్యెను.

పిమ్మట సైమనుసంఘ బహిష్కరణమును సంపూర్ణ స్వరాజ్య నినాదమును దేశమందు వ్యాప్తిఁగాంచెను. సంపూర్ణ స్వరాజ్యమే మన లక్ష్యమని నేతాజీ నిరాఘాటముగఁ జాటెను. ఈతఁడు జవహరులాలుతోఁ గలసి తన వాదకౌశలముచే నీ ప్రతిపాదన దేశీయ మహాసభయందుఁ గూడ నెగ్గునట్లొనర్చెను. తాను స్వచ్ఛందసేవక దళాధిపతిగ నుండి యశ్వారూఢుఁడై వాహ్యాళి సల్పుచు కలకత్తా దేశీయ మహాసభ నిర్విఘ్నముగఁ గొనసాగింపఁ గల్గెను.

కాని కాలక్రమమున మహాత్మునకును బోసుబాబు నకును ప్రధాన విషయముల భేదాభిప్రాయము మెండయ్యెను. గడువులోపల నధినివేశప్రతిపత్తి నీకున్న భారతదేశ లక్ష్యము సంపూర్ణ స్వారాజ్యమని ప్రకటింపఁబడునని మహాత్ముఁడు క్రొత్తగ నొక తీర్మాన ముపపాదించెను. కాని సంపూర్ణ స్వారాజ్య తీర్మాన మీవఱకే ప్రకటింపఁబడెను. కాన నియ్యది యనవసరమని జవహర్లాలును, బోసుబాబును ప్రతిఘటించిరి. కాని మహాత్ముని తీర్మానము నెగ్గెను. బోసుబాబు తన సంపూర్ణ స్వాతంత్ర్య నినాదమును వదలక 'ఫార్వర్డ్' పత్రికాద్వారమునఁ బ్రచార మొనరింపసాగెను. అది కారణముగఁ బ్రభుత్వమువా రా పత్రికపై నొక కన్ను వైచి కొంతకాలమున కద్దానిని బహిష్కరించిరి. కాని 'తాటాకు చప్పుళ్లకు కుందేళ్ళు బెదరునా!' దాని స్థానమున 'న్యూఫార్వర్డ'ను బత్రికయు, దానిని బహిష్కరింప 'లిబర్టీ' యను మఱియొక పత్రికయు వంగవాసులు సాగించిరి. అంతట ప్రభుత్వమే విసుగెత్తి స్థైర్యముతో నొక యడుగు వెనుకకు వైచి యూరకొనవలసి వచ్చెను.

అస్సాము వరదల సమయముననుకలకత్తా మిల్లు కూలీల సమ్మె సందర్భముననునేతాజీ యొనర్చిన మానవసేవ నిరుపమానము. కలకత్తా స్వాతంత్ర్యదినోత్సవసందర్భమునఁ బ్రభుత్వ నిషేధాజ్ఞ నుల్లంఘించి యుపన్యసించె నను నేరముపై మరల బోసుబాబున కొక వత్సరము కారాగార

శిక్ష విధింపఁబడెను.

జవహర్ అధ్యక్షతను జరిగిన లాహోరు దేశీయమహా సభయందు సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మాన మంగీకరింపఁ బడెను. తొలుత విముఖుఁడగు మహాత్ముఁడును తుద కీ తీర్మానమునకు సుముఖుఁడై దీనిపై తన యంగీకార ముద్ర వైచెను. కాని నేతాజీ ప్రతిప్రభుత్వము (Parallel Government) స్థాపించవలెనని మఱియొక మెట్టు పైకిఁ బోయెను. చూచితిరా! నేతాజీ స్వరాజ్య సంపాదన తృష్ణ! స్వాతంత్ర్య పిపాస! ఇట్లు మహాత్ముని రాజకీయ సిద్ధాంతములు బోసుబాబునకుగాని, బోసుబాబు సిద్ధాంతములు మహాత్మునకుఁ గాని నచ్చవయ్యెను. అంతట సుభాషు భారత స్వాతంత్ర్యసంఘము (Indian Liberty League) నందుఁ బ్రముఖపాత్ర వహించెను. జవహరుఁడాది యోధ వరేణ్యులు నేతాజీతోఁ జేతులు కల్పిరి.

ఇంతలో మరల స్వాతంత్ర్యదినము రాఁగ బోసుబాబు నాయకత్వము వహించి ప్రభుత్వపు లాఠీదెబ్బలకు గుఱి యయ్యెను. మరల నాఱుమాసములు కారాగార ప్రాప్తి నొందెను. ఉప్పుసత్యాగ్రహము నాపుటతో మరల విముక్తి గాంచెను. కాని గాంధి – ఇర్విన్ ఒడంబడిక బోసుబాబునకు నచ్చదయ్యెను. భగత్‌సింగు మున్నగు విప్లవ వీరుల మరణశిక్ష నాపుటలో మహాత్ముఁడుగాని దేశీయమహాసభ గాని యేమంతయు సాయపడలేదని బోసుబాబు తీవ్రముగ

నిరసించెను. కాలక్రమమున రెండవ రౌండు టేబిలు సమావేశము భగ్నమై దేశమున మరల ప్రభుత్వము నిర్బంధ చర్యలకుఁ గడంగెను. మన బోసు వీరునకు మరల నొక వత్సరము చెఱసాలప్రాప్తి యయ్యెను. మరల నారోగ్యము శిథిలమగుటవలన సెయోను కారాగారమునుండి జబ్బలుపూరు చెఱసాలకు మార్చిరి. కాని యట నారోగ్యభంగ మెక్కుడైనందున మదరాసుకు మార్చిరి. అచట 'యక్సురే' పరీక్ష జరిగి భిషక్కులాతఁడు క్షయవ్యాధి పీడితుండని తమ నిర్ణయ మొసంగిరి. స్విట్జర్లాండున కేగుమని సలహా నిచ్చిరి. ప్రభుత్వ మంగీకరించెను. కాని తలిదండ్రులఁ జూడ ననుజ్ఞ నీయరైరి. వియన్నా పట్టణమున సుభాషుబోసునకు శస్త్ర చికిత్స జరిగెను. అచట విఠలభాయి పటేలు సాహచర్య మబ్బెను. వీ రిరువురును మహాత్ముఁడు నాయకుఁడుగఁ బనికి రాఁడని యటనుండి యొక ప్రకటన గావించిరి.

ఇచటనే శయ్యాగతుఁడైన విఠలుభాయికి బోసుబాబు పెక్కుపచారము లొనర్చి ధన్యుఁ డయ్యెను. విఠలుభాయి మరణకాలమున బోసుబాబునకు లక్ష రూప్యములు మరణ శాసనము వ్రాసి భారతమాతృ హైన్యస్థితినిఁ గూర్చి విదేశములందుఁ బ్రచార మొనర్పుమని యాదేశించెను. విఠల భాయి మరణమునకే చాల విచారించుచున్న బోసుబాబునకు దండ్రి జబ్బుగా నుండెనను వార్త వచ్చెను. అంతట నాతఁడు తన యారోగ్యమునుగూడ సరకుగొనక వెనువెంటనే

గృహోన్ముఖుఁ డయ్యెను. కాని యితఁడు మధ్యేమార్గమున నుండఁగనే తండ్రి మరణవార్త చెవిసోకెను. అవసాన సమయమునఁ బితృసేవ యొనర్చి పితౄణము నీఁగ లేనైతిఁగదా యని నేతాజీ మిగుల వందురెను. కరాచీలో నడుగిడఁగనే ప్రభుత్వమువా రాతని వస్తుజాలమును గాగితములను స్తనశల్య పరీక్ష యొనర్చిరి. ఆతఁడు రచించుచున్న 'ఇండియన్ స్ట్రగుల్' అను పొత్తపు వ్రాతప్రతినిఁ గొన్ని ప్రకరణములు స్వాధీన మొనర్చుకొనిరి. ఆతఁ డెల్గో యింటికిఁ జేరి పితృయజ్ఞముఁ బూర్తి యొనర్చి మరల మంచము పట్టెను. చికిత్సకుల హితోపదేశానుసారము మరల వియన్నాకుఁ బయనమయ్యెను.

ఈ పర్యటనమున బోసుబాబునకుఁ బ్రముఖ విదేశ నాయకుల పరిచయభాగ్య మబ్బెను. ఈజిప్టు నాయకుఁడగు సహాజుబటుపాను, ఇటలీ నియంతయగు ముసోలినిని, ఐర్లాండునకు అధినేతయగు డివెలరాను, పరాసు మహాశయుఁడగు రోమను రోలాండును గలిసికొని భారత దౌర్భాగ్య స్థితినిఁ గూర్చి ససాకల్యముగ సావధానముగఁ జర్చించెను. వారును నత్యంతాదరమున నాలకించి మిగుల సానుభూతిఁ జూపిరి.

ఇట్లు వర్షత్రయము మాతృదేశ స్థితినిఁ గూర్చి వివరించుచు బ్రచార మొనర్చుచుఁ దన ఐరోపా పర్యటనమును ముగించెను. ఇంతలో జవహార్లాలు తన భార్య చికిత్స

కొంతకై యూరపున కేఁగి నాతనివలన నిచటి పరిస్థితుల నవగత మొనరించుకొనెను. భార్య మరణానంతరము జవహర్లాలుఁడు భారతదేశమునకు వచ్చుచుండ నేతాజీకిఁగూడ గృహోన్ముఖుఁడఁ గావలెనను నూహ యుదయించెను. కాని యచటి బ్రిటిషు ప్రభుత్వాధికారుల సలహా ననుసరించి యాతఁడు బొంబాయి రేవులో నడుగిడియు నిడక మున్నే నిర్బంధించిరి. మరల నొకసారి దేశమంతయు నొక్కుమ్మడిగ దృఢముగ నసమ్మతిని బ్రకటించెను.

ఏది యెట్లున్నను జెయిసాల జీవితము మాత్రము బోసుబాబు నారోగ్యమును బూర్తిగ భంగపఱచెను. ఆతనిని శరతుబోసు నింటియందు నిర్బంధించిరి. మిగుల నీరసముగ నున్న బోసుబా బలహాబాదున కేగి జవహరున కతిథిగ నుండి యాతనితోడను మహాత్మునితోడను నప్పటి రాజకీయ పరిస్థితులు సమగ్రముగఁ జర్చించెను. కొన్నాళ్ళకు సుభాషు కలకత్తా కార్పొరేషను 'ఆల్డరుమను'గ నెన్నుకొనఁబడెను. కాని యతఁడు మరల నారోగ్య రక్షణార్థము యూరపునకు వెళ్ళవలసి వచ్చెను. ఆతఁ డచ్చటఁ జికిత్స నొందుచుండగనే యిచ్చట హరిపుర దేశీయ మహాసభాధ్యక్షుఁడుగ పెక్కుఱచే సూచింపఁబడెను. బోసుబాబు లండను నగరమున నుండగనే యధ్యక్షుఁ డయ్యెనను వార్త చేరెను. అంత నాతఁడు స్వదేశాభిముఖుఁడై యచిరకాలమున హరిపురము చేరెను. అయ్యెదనునఁ బ్రజ లాతనియెడఁ జూపిన గౌరవాదర

విశేషములు పారములేనివి. ఆతని యాధ్వర్యమున హరిపుర దేశీయ మహాసభ యత్యంత జయప్రదముగ సాగెను. కలకత్తా కార్పొరేషను పరిస్థితు లసంతృప్తికరముగ నుండె నని ఆల్డరుమను పదవికిని, బక్ష నాయకత్వమునకును రాజీనామా యొసంగెను. అనారోగ్యకతమున నాతని దేశ సేవ కనేకాంతరాయములు గలిగినను నాతని యద్వితీయ దేశసేవానిరతివలన నతఁడు ప్రజల మన్ననను జూఱగొనెను.

తదుపరి త్రిపురీ దేశీయ మహాసభాధ్యక్ష స్థానమునకుఁ బట్టాభితోఁ బోటీగలిగి తుదకు బోసుబాబే నెగ్గెను. కాని విజయలక్ష్మి యనుగ్రహముతోడనే స్వాస్థ్యలక్ష్మి నిగ్రహము కూడఁ జేకూరెను. కాఁగా శయ్యాగతుఁడయియే యధ్యక్ష స్థాన మలంకరించుట కేగెను. అట మహాత్మునిఁ బోడఁగానమి నాతని వేంచేయుమని యత్యవసర తంతివార్త నంపెను. "నీవలె నేను వైద్యుల సలహా నతిక్రమింపఁజాల"నని మహా త్ముఁడు ప్రత్యుత్తరించెను. మహాసభ జయప్రదముగఁ గొన సాగెను. కాని పిమ్మట కార్యనిర్వాహకవర్గసభ్య నియా మక విషయమున మహాత్మునితోడను, తదితర కాంగ్రెస్ పెద్దలతోడను నభిప్రాయభేదము లేర్పడి బోసుబా బధ్యక్ష పదవికి రాజీనామా యొసఁగెను. రాజేంద్రబా బధ్యక్షుఁ డయ్యెను. కార్యనిర్వాహకవర్గ సభ్యుఁడుగ నుండుటకుఁ గూడ బోసుబా బంగీకరింపఁ డయ్యెను.

ఇంతకుమున్నే 1939 వ సంవత్సరమున 'ఫార్వర్డ్ బ్లా'

కను నొక పక్షమును నిర్మించి తద్ద్వారమున నమోఘ
మగు దేశసేవ నొనర్చెను. కాలక్రమమున దేశీయ మహా
సభా వామపక్ష సభ్య సమీకరణ మొనర్చెను.

ఏతత్సందర్భమున బోసుబాబు మన యాంధ్రరాష్ట్ర
పర్యటనమునకై వచ్చెను. అట ఫార్వర్డు పత్రికా ముద్రణా
లయమును ప్రభుత్వము వశపరచుకొని యందలి కార్యకర్త
లను బోసుబాబుతో సహా నిర్బంధమున నుంచిరి. కాని
యాతని యనారోగ్య కారణమున నభియోగము వాయిదా
వేయఁబడెను. బోసు సోదరులపై కాంగ్రెసువారు పెట్టిన
యాంక్షను దొలఁగింపుమని కొందఱు మహాత్మునకు విజ్ఞాపన
మంపిరి. వారు క్షమాభిక్ష వేఁడిన నట్లొనర్తునని మహాత్ముఁడు
సెలవిచ్చెను. ఎన్నికలు జరిపి, ఫార్వర్డ్బ్లాకు జయించునో
కాంగ్రెసు జయించునో చూతమని నేతాజీ సవాలొనరించెను.
తుద కెట్లో యీ పక్షము జాతీయ మహాసభామోదముఁ
బడయఁగలైను.

ఆలీపూరు న్యాయాధికారి బోసుబాబునకు మరల
నొక సంవత్సరము కారాగార శిక్ష విధించెను. కాని యనా
రోగ్య కారణముననే యప్రయత్నముగ నచిరకాలమున
విముక్తి గాంచెను.

చూచితిరా! బోసుబాబు కార్యదీక్ష! దేశసేవా
పరాయణత్వము! రాజకీయ విజ్ఞానము! బోసుబాబు రాజ
కీయ విద్యయం దారితేరుటయేగాక యాధ్యాత్మిక విద్యయం

దును నందె వేసిన చేయియే. విద్యార్థి దశయందే శ్రీరామ కృష్ణుని తత్త్వోపదేశముల నవగత మొనరించుకొనె నని చెప్పితిమికదా! తదుపరి శ్రీ వివేకానందస్వామి పరిచయము గూడ మెండయ్యెను. కాఁగా యోగసాధన తన యారోగ్య సంపాదన కుపకరించునని యయ్యది ప్రారంభించెను. 1941 వ సంవత్సరమున వ్యాఘ్రాజినముపై నధివసించి గీతాపారా యణ మొనర్చుచున్నట్లుండి యొక్కనాఁడదృశ్యుఁడయ్యెను.

ప్రభుత్వమువారా మటుమాయకుఁ గారణ మారయఁ జాలకయు నాతని పొలకువ గాంచ జాలకయుఁ బెక్కు తికమకలఁ గుడిచిరి. పిమ్మట బోసుబాబు ప్రాణమునకుఁ దెగించి మాఱువేషముఁ గైకొని నజాదు హిందూఫౌజను నొక భారతీయ సైన్యమును సమీకరించెను. తన ప్రతిభా విశేషమును, ధైర్యసాహసములను, నిష్కళంక దేశభక్తియు లోకమునకు జాటెను. అటనుండి జపాను దేశమున కేగి యింకను గొంతమంది యజాదు హిందూఫౌజు సైనికుల సమకూర్చెను. ఈసైనికులందఱు సమరవిద్యాపారంగతులు, దివ్య నవ్యాస్త్ర విదులు. కాకలు దేరిన కాలిబంట్లు. తమ ప్రాణముల నేక్షణమున కాక్షణము దేశమాతృ చరణపంకజ బలిపీఠమున నాహుతి యొనర్ప సంసిద్ధులు. స్వకీయ రక్త కణముల బహిర్గత మొనరించి దేశమాతకొఱకు తమ రక్తము ధారవోయుదుమని కఠోరశపథ మూనిన దిట్టలు. వారికి 'జైహింద్' 'ఢిల్లీఛలో' యనునవి యభిమాన నినాదములు.

భారతదేశమున బ్రిటిషువారి కాయువుపట్టగు ఢిల్లీ యెఱ్ఱకోట ముట్టడింపవలెనని వారి యాశయము. ఆహా! సుభాసు బాబు సాహసము!

పిమ్మట నిట్టి సైన్యసమీకరణము రాజద్రోహమని సైనికుల నిర్బంధించి నాయకులపై నభియోగము గల్పించి పెద్ద విచారణ సల్పిరి. కీర్తిశేషుఁడగు బల్లుభాయి దేశాయి తన వాదనా చాతుర్యముచేతను న్యాయశాస్త్ర పాండిత్య గరిమచేతను నీ యభియోగము రద్దగునట్లు సల్పెను. ఏది యెట్లున్నను బోసుబా బాకప్పుడు విమానారూఢుఁడై యేగుచు ఫార్మోజాయొద్ద నపాయమునకు గుఱియై మరణించె నను వార్త భారతదేశమున కశనిపాతమయ్యెను. కాని బోసుబా బింకను సజీవుఁడే యనియు గొందఱ యాశయము. మరణించిన యెడల మనకుఁ గల్గిన స్వాతంత్ర్యము గాంచి యైనను నాతని యాత్మ శాంతినొందును. మరణింపకున్న నాతఁడే స్వయముగ వచ్చి యీ స్వేచ్ఛావాయువులఁ బీలువఁ గల్గును. ఎట్లైనను నాతఁడు చరితార్థుఁడే. ఆతని జన్మ ధన్యమే. ఆతఁడు మృతజీవుఁడే.

# వల్లభభాయి పటేలు

భారత ప్రజా రాజ్యాంగమునకు ఉపప్రధానియై తన యసమాన పరిపాలనాచాతురి నగపరచిన వల్లభభాయి జీవిత చరిత్ర యవశ్య పఠనార్హము.

వినియుందురుగదా! గుజరాతు రాష్ట్రమందలి కైరా మండలమును గూర్చి. అయ్యదియే మన పటేలునకు జన్మస్థానమై పవిత్రీభూత మయ్యెను. చిరకాలముగ నామండలము విప్లవోద్యమమునకు మూలస్థానము, పటేలు తండ్రి కరుడు గట్టిన విప్లవకారుడు. "అవశ్యం పితృాచార" మనినట్లు మన పటేలునకు తండ్రి స్వభావమే యలవడి యంత గొప్ప నాయకుఁడు గాఁగల్గెను. పులికడుపున పిల్లి పుట్టదు గదా!

ఒకానొక సమయమున నొక సంస్థానాధీశుని సైనికులు పటేలు తండ్రిని బందీకృతు నొనర్చి యాతని యెదుట నిల బెట్టిరి. ఆ ప్రభు వత్తరి చదరంగ మాడుచుండెనట. వల్లభ భాయి తండ్రియు జదరంగమునం దందెవేసిన చేయియే. కావుటం జేసి యాతఁ డా నృపాలునకు గొన్ని చదరంగపు టెత్తుల నెఱుకపఱచెను. తత్కారణముగ నాతఁ డచిర కాలమున 'త్రోసిరాజు ఆటకట్ట'ని ప్రత్యర్థి నోడింపఁజాలెను. ఆ నరేంద్రుఁడు నీతని అద్భుత చదరంగ చాతురీగరిమను గొండాడి కృతజ్ఞతాసూచకముగ నాతని బంధవిముక్తు నొనర్చెను.

వల్లభభాయిపటేలెంతటి పితృభక్తి పరాయణుఁడో యంతటి భ్రాతృభక్తి గలవాఁడు. "పితృసమో జ్యేష్ఠః" యని యెఱింగి తన యన్నయగు విఠల్ భాయి పటేలు నత్యంతము ప్రేమించెడివాఁడు. విఠల్ భాయిపటేలశేషరాజ్యాంగ విద్యాపారంగతుఁడు. ఆతఁడు కొంత కాలము కేంద్రశాసనసభాధ్యక్షపీఠ మలంకరించి క్రేరారు మున్నగు హోంమెంబర్లకు గుండె గాలముగ నుండెను. ఈతని దెబ్బకు తట్టుకొనలేక యట్టివారు సెలవుపెట్టి కొంప చేరిరని చెప్పుదురు. ఈ యధ్యక్షపీఠ మలంకరించిన ప్రథమ హైందవుఁడితఁడే. శాసనధిక్కారము దేశమున బ్రవేశపెట్టఁబడగనే యీ మహామహుఁడీ యత్యున్నత పదవికి రాజీనామా యొసగి శ్రీకృష్ణజన్మస్థాన మలంకరించెను. తదుపరి కొంత కాలమున కాతఁడు కీర్తిశేషుఁడయ్యెను.

ప్రకృతమునకు వత్తము. వల్లభభాయికి తండ్రి విప్లవ భావములును, నగ్రజుని యద్భుతమేధాసంపత్తియు, నద్వితీయ రాజకీయ చతురతయు సంక్రమించి యాతఁడొక నాయకోత్తముఁడుగా గల్గెను.

వల్లభభాయి విద్యార్థిదశ యంత యుత్తమమైనది కాదు. తదితర నాయకులవలెనే యాతనికిని జదువునకును సగమొరుక. పుస్తకము చేతబట్టెడివాఁడు కాఁడు. ఉపాధ్యాయుల నెత్తురు నోటఁబోసి కొట్టెడివాఁడు. అది కారణముగ నాతఁడొక పాఠశాలనుండి మఱియొక పాఠశాలకు దఱచు మారుచుండెడి

వాఁడు. ఎంతటి కఠినహృదయుఁడగు నుపాధ్యాయుఁడును నాతని రెట్టమతమును మాన్పజాలకుండెను. మొత్తముమీఁద నాతని చదువంతయు వానకాలపు చదువే. తుదకెట్లోగొయొకట్లు తన విద్య కాశ్యాసాంతము చెప్పి యాతఁడు న్యాయవాద వృత్తియందు బ్రవేశించెను. కాలక్రమమున గొప్ప క్రిమినల్ లాయ రయ్యెను. హత్యలు, బందిపోట్లు, ధనాపహరణములు మున్నగు నభియోగములం దాతఁ డనన్యముగ వాదించి తన చాకచక్యమును జూపించి వానిని నిముసమాత్రమున గెలిపించెడివాఁడు. న్యాయాధికారులకు సైతము పక్షీలు పేరనిన సింహస్వప్నము. వా రీతని దెబ్బ తట్టుకొనలేక తమ న్యాయ స్థానముల నొకచోటనుండి మరియొక చోటికి తఱచు మార్చుకొనుచుండెడివారఁట.

తగినంత ద్రవ్యార్జన మొనరించి యాతఁడు న్యాయ శాస్త్రమునం దున్నతవిద్యఁ బడయుటకై ఇంగ్లాండున కేగెను. కాని యటను జదు వొంటబట్టక యెప్పటికా లిట్టిట్లే యన్న ట్లయ్యెను. కాని తుద కెట్లో బారిష్టరు పరీక్షయందు బ్రథముఁడుగ నుత్తీర్ణుఁడు కాగల్గెను. విద్య పూర్తియైన పిమ్మట నాతఁ డచటి ప్రకృతి దృశ్యములఁ జూడ నిచ్ఛగింపక వెన్వెంటనే యింటికి మఱలెను. ప్రకృతి సౌందర్యమునకు నాతనికిని సుదూరము.

వల్లభభాయి తన జీవితము దేశసేవ కంకిత మొనర్చి దేశ దాస్య విముక్తికై పాటుపడెను. మహాత్ముని సహాయ

నిరాకరణోద్యమమునందు దిగుటతో నాతని నిజమైన రాజకీయ జీవితము ప్రారంభమయ్యెను. ప్రథమమున మహాత్ముఁడనినను నాతని సిద్ధాంతము లన్నను వల్లభభాయి కెగతాళిగ నుండెడిది. అహింసా సత్యము లను నాయుధములచే రవి యస్తమింపని బ్రిటిషు సామ్రాజ్యము నెదుర్కొనుట యనిన నేనుఁగుతో దోమ డీకొనుట యని యాతని యభిప్రాయము. అది కారణముగ ప్రారంభమునఁ బటే లెప్పు డితరులతో గలసి మహాత్ము నపహాస్యము చేయుచుండెడివాఁడట. ఒక నాఁడు మహాత్ముఁడు తన యుద్యమ ప్రచారమునకై అహమ్మదాబాదు క్లబ్బులో నుపన్యసించుటకై యేగ పటే లాతనిని తూష్ణీంభావమునఁ జూచి వేళాకచోఁ జతుర్ముఖ పారాయణ మొనర్చుచుండెను. పేక నాడుచు మిత్రులతో సల్లాప మొనర్చుచు మధ్యమధ్య మహాత్ముని నంకఁ జూచి నిర్లక్ష్య సూచకముగ మందహాస మొనర్చుచుండెనట.

తదుపరి కొంతకాలమునకుఁ బటేలు మహాత్మునితో చేయికలిపి కృషి యొనర్ప సంకల్పించెనని విని యాతని స్నేహితు లాశ్చర్య నిమగ్నులైరి. పటే లొక్కమాఱు స్థిరసంకల్పుఁ డయ్యెనా యిఁక నాతని హృదయము హరిహరాదులు తలక్రిందైనను మారదు. నడుముగట్టి కార్యరంగమున కురికెనా యయ్యది సాంతముగ నెరవేఱువరకు వెనుదిరుగుట యను మాటయే యుండదు. పటేలు మిగుల గుండెనిబ్బరము కలవాఁడు. గుండె బెదరు, పిక్క చెదరు

నెఱుఁగక యెట్టి విషమసంఘటనల నేనియు నెదుర్కొనఁగల దిట్టరి. రాజకీయ సమరమునం దురుకుట యన్న మన సరదారునకు మిగుల సరదా. ఈతని నిబ్బరమును నిర్వికారతను జాటు నీ క్రింది సంఘటన నారయుఁడు.

పటేలు న్యాయవాదవృత్తి యుచ్ఛస్థితి నున్నపుడాతఁ డొక యభియోగమునందుఁ దీవ్రముగ వాదించుచుండెను. ఎదుటి పక్షపు న్యాయవాదియు నీతఁడును దీవ్ర వాదనా నిమగ్నులై యుండిరి. అట్టి సమయమున నీతని కొక తంత్రీవార్త వచ్చెను. అం దీతని భార్య పరమపదించె నని యుండెను. పటేలా వృత్తాంతమును జదువుకొని యా వార్తా పత్రమును వెంటనే జేబునం దిడుకొనెను. కాని యాతని ముఖమున నణుమాత్రమును వికారమునుగాని విచారమును గాని కన్పట్టఁ డయ్యెను. ఏమియు జరుగనట్టులనే తన వాదనను యథారీతి సాగించెను. ఆహా! ఎంతటి గాంభీర్యము! ఎంతటి స్థిరచిత్తము! నాటికి న్యాయస్థానము మూసినపిమ్మటగాని ఈ విషాదవార్త పైకిఁ బొక్కదయ్యెను. తరువాతఁగూడ నాతని మనోదార్ఢ్యత యించుకయు సడలదయ్యెను.

ప్రారంభమున మన రాజకీయ యంత్రమునుఁ దానే నిర్మాణ మొనరించి స్వయముగ నడపెను. రాజకీయ రంగమున నెన్నియో విషమసంఘటన లీతని నెదుర్కొనెను. కాని యట్టివానిని దాటుటయన్న నీతనికి నల్లేరుపై బండి

నడక. ఈతఁడు పార్లమెంటరీ కమిటీ కధ్యక్షుఁడుగ నుండి యేడు రాష్ట్రముల కాంగ్రెసు మంత్రివర్గములను నేకచ్ఛత్రముగ బాలించెను. రాష్ట్ర ప్రధానులకుగాని రాష్ట్ర నాయకులకుగాని యీతని యాజ్ఞ సుగ్రీవాజ్ఞగ నుండెడిది.

ఒకప్పుడు గుజరాతు రాష్ట్రము రాజకీయముగ చాల వెనుఁజిక్కి యుండెను. కాని మహాత్ముని నాయకత్వమున నయ్యది ముందంజ వైవగల్గెను. స్వయముగ నాత్మ విశ్వాసము గలవాఁడౌట పటేలు మహాత్ము నాత్మవిశ్వాసమునకు ముగ్ధుఁడై యాతని యడుగుజాడల మెలఁగెడివాఁడు. మహాత్ముఁడు దేశహితమగు నేప్రణాళిక ప్రవేశపెట్టినను సరదారు వెన్వెంటనే దాని నామోదించి తన భల్లూకపుఁ బట్టుతో నెరవేర్చెడివాఁడు. మహాత్ముని దివ్యసందేశమును బ్రచారించుటకై యాతఁడు గ్రామైక రాత్రముగ దిరిగి శంఖారావమొనర్చెను. కర్షక సంస్థల గ్రామ గ్రామమున నెలకొల్పి తుదకు పన్నుల నిరాకరణోద్యమమును దిగ్విజయ మొనర్చెను. దీనితో పటేలుకీర్తి మిన్నందెను. మఱియొకసారి గుజరాతులో శాసన ధిక్కారోద్యమమునకు నాయకత్వము వహించి మిగుల శ్లాఘ్యముగ నడపెను. ఈతని శాసనానుసారము గుజరాతునందలి ప్రభుత్వోద్యోగు లెందఱో తమ యుద్యోగములకు దిలోదకము లొసంగిరి. భారతీయ ప్రజ లీతని దేశీయ మహాసభాధ్యక్షునిగ నెన్నుకొని తమ కృతజ్ఞతను వెల్లడించిరి. తదుపరి నొకపట్టి మఱల నీతఁడు శాసన

తిరస్కారోద్యమమును నడుపుచుండఁ బ్రభుత్వమువారు మహాత్మునితోపాటీతనిని నిర్బంధించి రెండు సంవత్సరములు కారాగార శిక్ష విధించిరి.

మహాత్మునకు బ్రధాన శిష్యుఁ డయ్యును నాతనికిని నీతనికినిఁ బెక్కు విషయములందు భిన్నాభిప్రాయము గలదు. గాంధీజీ సత్యాన్వేషణ తత్పరుఁడు. పటేలు ఐహికవ్యవహార నిమగ్నుఁడు. మహాత్మునకు ప్రధానాదర్శ గ్రంథము భగవద్గీత. పటే లింతవఱ కొకటి రెండు పర్యాయములు తప్ప నా గ్రంథమును జదివి యుండఁడు. నిర్మాణ కార్యక్రమ మనినఁ బటేలునకు బ్రాణపదము. కాని తన యాధిపత్యమున కందఱును లొంగి యుండవలయునని యాతని మతము. అణుమాత్రమైన బ్రతిఘటన కాతఁ డోర్వజాలఁడు. ప్రతికక్షు లేరును తన కార్యక్రమమున కడ్డు రాగూడదు. భిన్నాభిప్రాయములు తనతో సంబంధము లేకుండ వేఱుగ నుండవలెను. ఒక్క నాయకునకు లోబడి యుండుట యను క్రమశిక్షణ వాంఛించును. కాని బహునాయకత్వము నొల్లఁడు.

పటేలు జీవితము మిగుల నిరాడంబరము. ధనమనిన నీతనికి దృణప్రాయము. తన సర్వస్వమును దేశమాతృచరణ సన్నిధానమున నర్పించి త్యాగధనుఁడను కీర్తిఁ బడసెను. కాని ధనము సర్వార్థ సాధనమనియు ధనికవర్గము తన చెప్పుచేతులలోనుండు టావశ్యకమనియు నెరిగి ధనికుల నెక్కుడుగ జాతీయ మహాసభా సభ్యులుగఁ జేర్చుటకు

యత్నించెను. ధనికవర్గము జాతీయమహాసభకు వెలుపల నున్న దమ యిచ్చవచ్చిన తెఱంగున నాడుదురని యాతని నిశ్చితాభిప్రాయము. విఠల్‌భాయి, మోతీలాల్, చిత్తరంజ నుఁడు మున్నగు మేధావులు శాసనసభా ప్రవేశ మంగీకరించి నపు డీతఁడు గాంధీపక్ష మంటిపట్టుకొని వారితో హోరాహో రిగఁ బోరెను. గొప్ప అపరిణామవాది యని ప్రఖ్యాతిఁ గాంచెను. పార్లమెంటరీ విధాన మంతయు దన హస్తగత మొనరించుకొని దాని ననన్య సామాన్య విధమున నడపెను.

చిరకాలము పటేలు జాతీయ మహాసభా దక్షిణ పక్షమునకు నాయకుఁడుగ నుండెను. అందలి ఉన్నతాధికార వర్గమున నీతని పలుకుఁబడి హెచ్చు. జవహారులాలు సైత మితని యభిప్రాయము లవశ్యము గ్రహించును. స్వరాజ్య సంపాదనానంతర మీతఁడు నూతన రాజ్యాంగమున కుపాధ్యక్షుఁడై తన యద్వితీయ ప్రతిభను వెల్లడించు చుండెను. స్వదేశ సంస్థానముల నైక్యభారతమున లీన మొనర్చు విషయమున నీతఁ డొనర్చిన కృషియు, నిటీవల హైదరాబాదు సంస్థాన విషయమున జవహారునితో గలసి ఈతఁ డొనర్చిన పరిష్కార చాకచక్యమును చిరస్మరణీయ ములు. పటేలు జీవితమున నీ రెండు సంఘటనలును వర్ణనా తీతములు. కాన వానినిఁ గూర్చి యించుక ముచ్చటించు కొందము.

తాత్కాలిక ప్రజా ప్రభుత్వ ప్రతిష్ఠానంతరము

రాజ్యాంగ నిర్ణయ పరిషత్తు నెలకొల్పఁబడెను. ఈ పరిషత్తు నందు రాష్ట్రసభ్యులు 292 మంది, సంస్థాన సభ్యులు 93 మందియు నుండిరి. ఈ పరిషత్తునందు ముస్లింలీగు జేరదయ్యెను. ముస్లింలీగు తిరస్కారమునకుఁ బటేలు కించపడెను. కాని వారు చేరినను జేరకున్ననుఁ బరిషత్సమావేశము జరిగి తీరవలెననియే యాతఁడు పట్టుబట్టెను. డాక్టరు రాజేంద్రప్రసాదధ్యక్షుఁడుగ నీ సమావేశము జరిగెను.

ఇంతలోఁ బంజాబు బెంగాలు రాష్ట్రములందు హిందూ మహమ్మదీయ పోరాటము చెలరేఁగి రక్తపాతము మిక్కుటమయ్యెను. వల్లభభాయి మహమ్మదీయ ద్వేషియని కొందఱు గాంధీజీతో బితూరి యొనర్చిరి. ఉపవాస దీక్షలో నున్న గాంధీజీ పటేలు పరమ పవిత్రుఁడనియు నాతఁడట్టిపన్నిదొనర్పఁడనియు దన నిశ్చితాభిప్రాయమును బ్రకటించెను. ఈ మతకలహాగ్నిఁ జల్లార్పవలెనని గాంధీజీ విశ్వప్రయత్న మొనర్చెను. కాని విఫలమనోరథుఁడయ్యెను.

మౌంటుబాటను భారత నాయకుల నెల్ల నాహ్వానించెను. అందు వల్లభభాయి పటేలొకఁడు. హిందూదేశము రెండుగ విభజింపబడవలెననియు, రెండు కేంద్రప్రభుత్వములు స్థాపింపఁబడవలెననియు బ్రిటిష్ పార్లమెంటువారి యభిప్రాయమును మౌంటుబాటన్ వివరించెను. తొలుదొల్త దీనికి మన నాయకు లంగీకరింపరైరి. కాని ముదిగిన కాలు తెగకోసి కొనవలెననియు బ్రిటిషువారి పీడ విఱుగడ యగుననియు

ధుధ కియ్యకొనిరి.

అంత రెండు రాజ్యములకు నాస్తి యప్పుల పంపకము ప్రారంభమయ్యెను. దీనికి మౌంటుబాటన్ అధ్యక్షత క్రిందనే యొక విభజన సంఘము స్థాపింపఁబడెను. సర్దారు వల్లభభాయిపటేలు గూడ విభజన సంఘ సభ్యుఁడయ్యెను.

ఇట్లు భారతమాత రెండుగ విభజింపఁబడి స్వతంత్ర పరిపాలన గల రెండు యధినివేశ రాజ్యములుగఁ జీల్చఁబడెను. అవియే పాకీస్థాన్ హిందూస్థా ననునవి. 1947 ఆగష్టు 15 వ తేదీన స్వతంత్ర పరిపాలన ప్రారంభమయ్యెను. భారత చరిత్రయం దీ దినమే సువర్ణాక్షరముల లిఖింపఁదగినది. పటేలు పట్టుదలవల్లనే భారతాధినివేశ రాజ్యమునకు మౌంటుబాటను ప్రథమ గవర్నరుజనర లయ్యెను. భారతప్రభుత్వమునకు జవహ్వారులాలు ప్రధానియు పటేలుపప్రధానియు నైరి.

తదుపరి పాకీస్థానమునుండి హిందూస్థానమునకును, హిందూస్థానమునుండి పాకీస్థానమునకును లక్షల కొలఁది ప్రజల మార్పిడి జరిగెను. ఈ మార్పిడియందు మహమ్మదీయులు హత్యలు, వనితాపహరణము, గృహదహనము మున్నగు దుశ్చర్యలు బెక్కు లొనర్ప యసంఖ్యాకులగు నిరపరాధులు దుర్మరణము పాలైరి.

ఈ రక్తప్రవాహము నరికట్టఁదలఁచి పటేలు 'హింసకు బ్రతిహింస పనికిరా దనియు, పాకీస్థానమునకు

దరలఁ దలఁచిన మహమ్మదీయులు నిరాటంకముగఁ బోవచ్చు ననియు' కచ్చితముగఁ జెప్పివైచెను. ఆస్తి పంపకమునందు హిందూస్థానము పాకీస్థానమునకు 55 కోట్ల రూప్యము లీయ వలసి వచ్చెను. పాకీస్థానముకూడ మనకు కోట్లకొలఁది రూప్యములు ఋణపడెను. కాని వారు మనకీయవలసిన దీయకయే తమకు రావలసిన 55 కోట్లను రావలెనని మొండి పట్టు పట్టెను. కాని పటేలు 'మీ రియ్యవలసిన దిచ్చు దనుక మేము దమ్మిడీ నీయ' మని నిర్మొగమోటముగఁ జెప్పెను. పాకీస్థాన్ పరిపాలకులు కలఁతఁజెంది గాంధీజీతో మొఱవెట్టుకొనిరి. గాంధీజీ యంగీకరించెను. పటేలు 'మనము ధనమును నీరు వాడినట్లు వాడుచున్నా' మనెనే కాని గాంధీజీ మాట కెదురాడలేకపోయెను.

హిందూస్థానమునఁ గూడఁ బ్రతిహింస చెలరేగ సాగెను. దానిని వారింప గాంధీజీ యఖండకృషి యొనర్చెను. అదిగాంచి పాకీస్థానమునుండి వచ్చిన కాందిశీకులకును, వారిని యభిమానించెడి వారికిని గాంధీజీపై ద్వేషము మెండైనది. గాంధీజీ మహమ్మదీయాభిమాని యనియు, హిందూద్వేషి యనియు దురభిప్రాయ మేర్పడెను. పర్యవసానము మనకు పరిచితమే. 1948 వ సంవత్సరము జనవరి 30 వ తేదీన గాడ్సే యను హంతకుఁడు ప్రార్థనాసమయమున మహాత్ముని దన పొట్టఁ బెట్టుకొనెను. మహాత్ముని నిర్యాణమునకై పటేలు తల్లినిఁ గోల్పోయిన పసిబిడ్డవలె విలపించెను.

భారతోపప్రధానిగఁ బటేలు పెక్కు కార్యములు జక్కఁబెట్టవలసి యుండెను. అందు సంస్థానముల స్వాధీన మొనర్చుకొనుట, కాందిశీకులకుఁ బునరావాసము లేర్ప అచుట ప్రధానమైనవి. ఇంతలో భారత స్వాతంత్ర్య ప్రథమ వార్షికోత్సవ మేతెంచెను. ఆ యుత్సవసమయమునఁ బటేలు పూర్వాపర సందర్భ సమీక్ష నొనర్చుచు గంభీరోపన్యాస మొసంగెను.

కొంతకాలమునకు బ్రిటిషురాజునకుఁ గల 'భారత సార్వభౌమ' బిరుదము తొలగింపఁ బడినట్లు బ్రిటిషు పార్ల మెంటు ప్రకటించెను. దానితో చర్చిలున కుడ్డుగుడుచు కొన్నటులై లేబరు ప్రభుత్వమును భారతనాయకులను నోటికి వచ్చినట్లు తూలనాడెను. దానితో పటేలాగ్రహావేశపర వశుఁడై యాతనికి సరియగు జవాబునిచ్చి నోరు మూయించెను.

అసంఖ్యాకములగు స్వదేశ సంస్థానముల నేకచ్ఛ త్రాధిపత్యము క్రిందికిఁ గొనివచ్చుట పటేలు సాధించిన ఘన విజయములందుఁ బ్రధానమైనది. స్వాతంత్ర్యము లభించి యేడాదియైన నిండకుండనే పటే లీ ఘనకార్యము సాధింపఁ గలిగెను.

విభజించి పరిపాలించు సూత్రముపై నాధారపడిన బ్రిటిషుప్రభుత్వము సంస్థానములందైనను తమ యధికారము నిలఁబెట్టుకొన ప్రయత్నించెను. ఈ దృష్టితోడనే 1919 నుండియు రాష్ట్రములకును సంస్థానములకును మధ్య పుల్లలు

బెట్టుచుండెను. మన దేశమున 562 సంస్థానములు గలవు. అన్నిటికన్న మిక్కిలి విస్తీర్ణముగలది కాశ్మీరము. ఎక్కువ జనసంఖ్య గలది హైదరాబాదు. దేశ విభజనానంతర మీ సంఖ్య 544 అయ్యెను.

భారత జాతీయ ప్రభుత్వ మే సంస్థానమునకు గాని స్వతంత్ర ప్రతిపత్తి యున్నట్లు గుర్తింపదయ్యెను. కాని యనేకులు సంస్థానాధీశులును వారి దివానులును తాము స్వతంత్రముగ నుండవచ్చునని వాదించిరి. సంస్థాన వ్యవహారములఁ బరిష్కరించుట కొక శాఖ యేర్పడి దానికి పటే లధ్యక్షుఁ డయ్యెను.

అధ్యక్షుఁడైన వెంటనే యాతఁ డొక ప్రకటన గావించెను. 'భారతదేశ మఖండముగ లేనందువలననే విదేశ దండయాత్రలకు గుఱియయ్యెను. ఇప్పుడైనను నేకీకరణ ముత్తమము. విదేశ వ్యవహారములు, రహదారులు, రక్షణము వీనియందు కేంద్రప్రభుత్వముతో నొడంబడిక జేసికొనిన యెడల మిగిలిన వ్యవహారములందు వారి స్వాతంత్ర్యమునకు భంగమురాదు.'

సంస్థానాధీశు లంద ఱీ ప్రకటనతోఁ దమ భయసందేహములుమాని మనసు మార్చికొనిరి. మౌంటుబాటను గూడ నొక సంస్థానాధీశుల సభ నేర్పాటుగావించి యీ విషయమే నొక్కి వక్కాణించెను. తత్ఫలితముగ 1947 ఆగష్టు 15 నాటికిఁ గాశ్మీర హైదరాబాదులు దప్ప మిగిలిన వన్నియు

యూనియనునఁ జేరెను. జూనాగడమునందు రెఫరెండము జరిగి సంస్థాన ప్రజ లందఱు నిండియన్ యూనియనునందు జేరుటకే తమ యంగీకారమును సూచించిరి. నవాబు, దివానులు పాకీస్థానమునకు బలాయితులైరి.

చిన్న సంస్థానము లన్నియు బరిసర రాష్ట్రములందు విలీన మయ్యెను. ఈ విలీనీకరణమువలనఁ జిన్న రాష్ట్రములు బెద్దవయ్యెను. మఱికొన్ని సంస్థానము లొక కూటమిగ నేర్పడి వాని కొక కేంద్ర ప్రభుత్వ మేర్పడెను. వాని పరి పాలన యొక యధ్యక్షున కప్పగింపఁబడెను. సర్దారు వల్లభభాయి పటేలిట్టు లొక సంవత్సర కాలమున సంస్థాన వ్యవహారముల మిగుల సునాయాసముగఁ బరిష్కరించెను.

ఇక పటేలు హైదరాబాదు విషయ మెట్టి చాక చక్యముతోఁ బరిష్కరించెనో యారయుఁడు. 1947 ఆగస్టు 15 నాటికి సంస్థానము లన్నియు యూనియనులో జేరెనని చెప్పితిమిగదా! హైదరాబాదు మాత్ర మట్టి యొప్పందము నంగీకరింపలేదు. తనకును మిగిలిన సంస్థానములకును దారతమ్యము గలదనియు, భారత ప్రభుత్వముతో మైత్రికై వేఱొక యొప్పందము జేసికొందుననియు దాని వాదన. ఈ వాదనకు గొందఱు బ్రిటిషువారును బాకీస్థాన్ వారును బ్రక్కతాళములు వైచిరి.

భారత ప్రభుత్వముతోఁ దాత్కాలికపు టొడంబడిక జేసికొనిన పిమ్మట హైదరాబాదు నవాబు క్రొత్త మంత్రి

వర్గము నేర్పా టొనరించెను. ప్రధానమంత్రి మీర్ లాయక్ ఆలీ. ఈతఁ డొక గొప్ప వ్యాపారి. ఈ మంత్రివర్గమునందు నల్వురు హిందువులు, ఎనమండుగురు మహమ్మదీయులు. ఈ యెనమండుగురును కాశిం రజ్వీ యను న్యాయవాది సూచనపై నియమింపఁబడిరి. ఈతఁడు పేరునకు న్యాయ వాదియే కాని, వట్టి యన్యాయవాది. ఈతఁడు రజాకా రనఁబడు నొక స్వచ్ఛందదళము నేర్పాటు గావించెను. ఈ రజాకారు లందఱును హిందువులను హింసింపసాగిరి. ముస్లిములు పాలకులనియు, హిందువులు పాలితు లనియు నాతని నమ్మకము. రజాకారులు పొరుగు రాష్ట్రములందలి గ్రామములపైఁ బడి దోచుకొనసాగిరి. ప్రభుత్వోద్యోగులును ముస్లిములే కాన రజాకారుల దుండగముల నరికట్టక చూచియు జూడన ట్లూరకుండిరి. ఒడంబడిక ప్రకారము భారతీయ సైన్యముకూడఁ దొలఁగింపఁ బడెనుగాన రజా కారుల దౌర్జన్యములు మితిమీరుచుండెను.

ఇట్టి దుండగములు జరుగుచున్నను 'హైదరాబాదున కన్యాయము జరుగుచున్న'దని చర్చిలును పాకిస్థాన్ ప్రభుత్వ మును వాపోవఁ దొడగిరి. 'మా దేశ వ్యవహారములందు జోక్యము గలిగించుకొనవల'దని చర్చిలును బటేలు గట్టిగ మందలించెను. కాని రజాకారుల చర్యలు మితిమీరు చుండెను. లాయక్ ఆలీ రహస్యముగ విదేశములనుండి యాయుధములు విమానములపై దిగుమతి యొనర్చుచుండెను.

ఇది యంతయు మిగుల జాగరూకతతో గమనించు చున్న జహ్వారు పటేలులు 1948 సెప్టెంబరు 13 వ తేది వేకువను భారత సైన్యమును హైదరాబాదు మీఁది కంపిరి. ఈసైన్యమునకు రాజేంద్రసింగు నాయకుఁడు. భారత ప్రభుత్వము దీనికి బోలీసుచర్యలని నామకరణ మిడెను. ఇంతకు ముందే లాయక్ ఆలీ మిత్రరాజ్యసమితికి ఫిర్యాదొనర్చెను. వా రా ఫిర్యాదును విచారింప నిశ్చయించిరి. కాని విచారణ ప్రారంభము కాకమున్నే మూఁడు దినములలో హైదరాబాదు లొంగిపోయెను. లాయకాలీ మంత్రివర్గము పలాయితమయ్యెను. నవాబు భారత సైన్యమును దన సంస్థానమాక్రమించుకొని శాంతి నెలకొల్పుఁడని ప్రార్థించెను.

సంక్షుభిత సంస్థానమునఁ బరిస్థితులు చక్కఁబడువరకు జె. యన్. చౌధురి మిలిటరీ గవర్నరుగ నియమింపఁబడెను. పరిసర రాష్ట్రములనుండి కలెక్టరులును బోలీసు సూపరింటెండెంట్లును బంపఁబడిరి. లాయక్ ఆలీయు రజ్వీయును చెఱఁ బెట్టఁబడిరి. పిమ్మట కొంతకాలమునకు లాయక్ ఆలీ తప్పించుకొని సకుటుంబముగ బాకిస్థాను జేరెను. రజ్వీ విచారింపఁబడి యావజ్జీవ కారాగార శిక్ష విధింపఁబడెను.

అచిరకాలమునఁ బటేలు సంస్థానమున శాంతిభద్రతలు నెలకొల్పఁజాలెను. తాను మధ్యవర్తిత్వమును వహించి సంస్థాన కాంగ్రెసునందలి యభిప్రాయ భేదములఁ దొలఁగింపజాలెను. కొలఁది కాలమున మిలిటరీ ప్రభుత్వము రద్దయి

నూతన మంత్రివర్గ మేర్పడెను. ఈ మంత్రివర్గమున శ్రీ ఎం. కె. వెల్లోడి ప్రధానమంత్రి. హైదరాబాదు ప్రజలిప్పటికినిఁ బటేలునుఁ బ్రాణదాతగాఁ బ్రశంసించుచున్నారు.

ఇట్లు హైదరాబాదునుగూడ లోఁగఁదీసి ఐక్యభారతమును స్థాపించి పటేలు అఖండ భారతవిధాత యను కీర్తి నార్జించెను. భారతదేశ పటమునే మార్చివేయఁ జాలెను. ప్రాణనష్ట మేమాత్రము జరుగకుండనే యిట్టి మార్పొనరించి పటేలు తన రాజకీయ దురంధరత్వమునుఁ బ్రకటింపఁ గలిగెను. భారతదేశము నే విధముగ విభజించినను బ్రమాదము వాటిల్లునని యాతని యభిప్రాయము. అందువలననే భాషాప్రయుక్త రాష్ట్ర విభజనమున కతఁడు వ్యతిరేకవాది.

నూతన రాజ్యాంగవిధాన మీతని రాజకీయ చతురతచే చిరకాలము నడుపబడు భాగ్యము లేకపోయెను. ఇట్టి నిరంతర కృషిచే యాతని యారోగ్యము దెబ్బతినెను. వైద్యుల సలహాపై నాతఁడు మంసూరిలో విశ్రాంతిఁ దీసికొనుచుండ హైదరాబాదు కల్లోల మేతెంచి యాతని విశ్రాంతికి భంగము వాటిల్లెను. 1949 లో జయపూరునకు విమానములోఁ బోవుచుండ విమానము చెడిపోయెను. యాత్రికులకు ప్రమాదము వాటిల్లు స్థితి యేర్పడెను. కాని సంచాలకుని చాతుర్యమున నది సురక్షితముగఁ గ్రిందికి వ్రాలి ప్రమాదము తప్పెను. నిర్దిష్టకాలమునకుఁ బటేలు జయపూరునకుఁ జేరనందున నెహ్రూ మున్నగు నాయకులును సమస్త భారత

ప్రజలును భయభ్రాంతులైరి. అసంఖ్యాకములగు విమానములు దేశము నలుమూలలకుఁ బోయి పటేలుజాడఁ గను గొను నంతవఱకు శేషభారత ప్రజానీకము ప్రాణము లఱచేతఁ బట్టుకొని యుండిరి. సుమారైదు గంటలైన పిమ్మట నాతని క్షేమవార్త తెలిసి ప్రజ లమితానంద భరితులైరి. ఆతనిఁ జూడఁగనే పార్లమెంటు సభ్యులు హర్షధ్వను లొనర్చి యాతని కొక వెండి విమానము బహూకరించిరి. నవభారత రాజ్యాంగ రచనమునఁ బటేలు ప్రముఖపాత్ర వహించి పెక్కు సూత్రముల సూచించెను.

ఇంతలో ననారోగ్యమునకుఁ దోడు పటేలునకు వృద్ధాప్యము కూడ సంభవించెను. ఆరోగ్యము బొత్తుగ శిథిలమయ్యెను. ఢిల్లీ వాతావరణముకన్న బొంబాయి వాతావరణ మాతని యారోగ్యమునకు దగియుండునని వైద్యులు హితవొసంగిరి. ఆతఁడు బొంబాయి చేరెను. పయనమునకు సిద్ధమగునపు డాతఁడు మిత్రులతోఁ దన కవసానదశ సమీపించినదని చెప్పెను. బొంబాయి చేరగనే యాతనికి స్వస్థత చేకూరినట్లే యగుపడి మరల నకస్మాత్తుగ రుగ్మత యెక్కుడై తన 75-వ యేట నాతఁడు పరమపదించెను. యావద్భారతము విలపించెను.

# పండిత జవహారులాలు

కలదుగదా భారతదేశమున దేవభూమియని ప్రఖ్యాతిఁ గాంచిన కాశ్మీర రాష్ట్రము! అందుఁ జిరకాల ప్రసిద్ధిఁగాంచిన యొక బ్రాహ్మణ కుటుంబము గలదు. ఈ కుటుంబమునకుఁ జెందిన రాజకౌలను నొక భూసుర శ్రేష్ఠుఁడు కారణాంతరములఁ జిరకాలము క్రిందటనే హస్తినాపురము చేరెను. అప్పటి మొగలాయి ప్రభు వాతని నాదరించి తన యాస్థాన పండితుఁడుగ నొనర్చుకొనెను. యమునాతీరమున నాతని కొక భవనమును కట్టించి యిచ్చి యొక జాగీరును సైత మిచ్చెను. హిందీ వాడుకభాషయందు 'నహార్' అనఁ గాలువ. అందువలన నా బ్రాహ్మణ కుటుంబమునకు నహారు కౌలు లని పేరువచ్చెను. కాలక్రమమునఁ 'గా' లను పద మంతరించి నహారు నెహ్రూగఁ బరిణమించెను. అది కారణముగ వారి వంశనామము నెహ్రూ యయ్యెను.

కౌలుపద మంతరించినట్లే యాతని జాగీరును నచిర కాలమున నంతరించెను. ఈ వంశమునఁ దదుపరి లక్ష్మీనారాయణ యను నాతఁడు ఢిల్లీలోఁ గుంభినీవారి న్యాయవాదిగ నుండెను. ఆతని పుత్రుఁడు గంగాధర నెహ్రూ ఢిల్లీకిఁ గొత్వాలు చేసెను. ఈతఁడు సిపాయి కలహ సమయమున హస్తినాపట్టణమును వీడి సకుటుంబముగ నాగ్రా చేరెను. ఆతనికిఁ గనిష్ట పుత్రుఁడు మోతీలాలు నెహ్రూ, మన కథా

నాయకుఁడగు జవహర్లాలుని జనకుఁడీ మోతీలాలే.

మోతీలాలు భార్య స్వరూపరాణి. ఆయమ మిగుల సౌందర్యవతి కాన యామె నామము సార్థకము. ఆమె దయా శీలాది సద్గుణములుగల పతివ్రతా శిరోమణి. ఈ పుణ్య దంపతులకు జవహరుఁడు 1889-వ సంవత్సరమున అలహా బాదులో నుదయించెను.

మోతీలాలు కలవాఁడు. జవహరుఁడాతని కేకైక పుత్రుఁడు కాన, నతఁడు బాల్యమున మిగుల గారాబముగఁ బెరిగెను. మోతీలాలునకుఁ బాశ్చాత్య వ్యామోహము మెండు. అందువలన నతఁడు తన గారాబుపట్టిని బాశ్చాత్యు లగు దాదులచేఁ బెంచెను. ఆతఁడు పాశ్చాత్య వాతావరణ మున బెరిగెను. మోతీలాలు ధనవంతుఁడగుటచేతనే తన ముద్దుల బిడ్డను బాఠశాలకుఁ గూడఁ బంపఁడయ్యెను. సమర్థు లగు గురువులచే నింటికడనే చదువుసంతల సాగించెను.

తండ్రి బుద్ధిసూక్ష్మత, ధైర్యస్థైర్యములు, స్వాతం త్ర్యాభిలాష కుమారున కబ్బెను. కాని, యాతని దుడుకుఁ దనము కాని, తొందరపాటుగాని కుమారునకు సంక్రమింప లేదు. జవహరునకుఁ దల్లికడనున్న చనువు తండ్రివద్ద లేదు. మీఁదుమిక్కిలి తండ్రినిఁ జూచిన గడగడ లాడువాఁడు. బాల్యమున నొకటి రెండు పర్యాయములు తండ్రిచేఁ దాడన ములుగూడ సంభవించెను. జవహరుఁడు చిఱుతప్రాయము ననే గుఱ్ఱపుస్వారి, ఈత మున్నగు వ్యాయామము లభ్యసించి

కాలక్రమమున వానియందు దిట్టయయ్యెను. సంస్కృతము, ఉర్దు మున్నగు నితరభాషలందుఁ బరిచయము గడించెను. పౌరాణిక గాథ లన్నిటిని హృద్గత మొనరించుకొనెను. ఆంగ్లసాహిత్యమునఁ జక్కని పాండిత్య మలవఱచుకొనుటయే కాక యుపనిషత్తులు, భగవద్గీత, దమ్మపదము మున్నగు మతగ్రంథముల నెన్నిటినో కాచి వడఁబోసెను.

అనిబిసెంటుగారి దివ్యజ్ఞాన సమాజమున సభ్యుఁడుగఁ జేరుటవలన నామె ప్రతిభావిశేషమును, వక్తృత్వమును వాదనా చాతురియుఁ గొంత పట్టువడెను. భారతీయ ప్రాచీన సంస్కృతి యనిన నాతనికి బ్రీతి మెండు. జవహరు బాల్యము నుండియు వార్తాపత్రికాపఠనమును నేమఱడివాఁడుగాఁడు. స్వదేశ విషయములనే కాక పరదేశ విషయములను గూడ నత్యంత శ్రద్ధతో జదివెడువాఁడు. బలహీనమగు దేశమేదైన స్వాతంత్ర్యముకొఱకుఁ బోరాడి జయము గాంచెనను విషయము గాంచిన నద్దాని నొకటి రెండు పర్యాయములు మిగుల నుత్సాహముతోఁ జదివి యానందించెడివాఁడు. అధికసంఖ్యాకు లెవరైన నల్పసంఖ్యాకులఁ బీడించు విషయము పత్రికలందుఁ గాంచిన మిగుల వగచెడివాఁడు. చిఱుతప్రాయముననే జవహరు స్వదేశ విషయముల నాకళింపు చేసికొని రాజ్యతంత్ర సారమును రాజకీయపు టెత్తులను నువ్వెత్తుగ గ్రహింపఁగలైను. మోతీలాలు పాశ్చాత్య నాగరికత యన చెవి కోసికొను నంటిమి గదా! ఆ కారణ

మునసే తన కుమారున కీ దేశమున నున్నతవిద్య గఱపఁ దలంచలేదు. ఒంటరిగ నతని దూరదేశముల కంపుటయు నిష్టములేదు. అది కారణముగఁ బుత్రుని పాశ్చాత్య విద్యార్థము తాను సకుటుంబముగ యూరపునకు బయలుదేరెను. కుమారు నొక పాఠశాలయందు జేర్చి, తాను యూరపు నలుగడల సంచరించి పుత్రుని వెంటకు తిరిగివచ్చునట నిలు చేరెను. జవహరుఁడు చేరిన పాఠశాల మహారాజకుమారులు చదువునది. అట నీతఁడు పాశ్చాత్య సంఘ మర్యాదలు, నాటలు, పాటలు మున్నగునవి యభ్యసించుటయే కాక లాటిన్, ఫ్రెంచి భాషలను జక్కఁగ నేర్చెను. ఆ సమయ మందును బత్రికాపఠన మునిన ప్రాణపదముగ నెంచుచు దాని నేమఱక ప్రపంచమందలి ప్రతిదేశమునందును గల సాంఘిక, ఆర్థిక, రాజకీయాది విషయముల నామూలాగ్ర మవగత మొనరించికొనెను.

పత్రికలందు స్వాతంత్ర్యము కొఱ కల్పసంఖ్యాకులు పోరాడుచున్నట్లు చదివినప్పుడెల్ల భారతదేశమున కెప్పుడు స్వాతంత్ర్య మబ్బునా యని తహతహ లాడుచుండువాఁడు. తద్విషయకములైన గ్రంథముల నెన్నిటినో యాతఁడు చదివెను. తా నాంగ్ల దేశమున నుండియు భారతదేశ విషయ ములను బత్రికలయం దతిజాగరూకతతోఁ బరిశీలించుచుండు వాఁడు. వంగదేశ విభజనము స్వదేశీయోద్యమము మున్నగు వానిని గుఱించి దాదాభాయి నౌరోజీ, తిలకు, పాలు

మున్నగు నాయకులు పత్రికలయందు చేయు ప్రచారమును గాంచి తా నెప్పుడు పాల్గొందునా యని మిగుల నుబలాటపడువాఁడు.

ఉన్నత పాఠశాలయందలి విద్య పూర్తిగావించి జవహరు కేంబ్రిడ్జి కళాశాలయందు ట్రైపాసు పరీక్షయందుత్తీర్ణుండై ఎం. ఏ. పట్టము నందెను. వృక్ష, రసాయన, భూతత్త్వ శాస్త్రము నాతని యభిమాన విద్యలు. ఇక నాతఁడు పండిత బిరుదార్హుఁడనుటకు సందియమేమి ?

పసిడికిఁ దావి యబ్బినట్లు లాతని కుశాగ్రబుద్ధికినిఁ బాండిత్యమునకును దోడు నాతనికడ సౌశీల్యమును గలదు. భోగలాలసుల కాకరమగు నింగ్లాండునందు చరించుచున్నను నాతఁ డొకప్పుడైనఁ దన శీలమునకు భంగము రానిచ్చి యెఱుఁగఁడు. ఆతఁడు విద్యార్థి దశయందు సెలవు దొరకినపుడెల్ల, నాంగ్లభాషా గ్రంథపఠన మొనర్చి జ్ఞానాభివృద్ధిఁ జేసికొనెనే కాని యొక్క క్షణమైన వృథాపోనిచ్చువాఁడు కాఁడు. ఆధునికులం దిట్టి విద్యార్థు లెందఱు గలరందురు ? ఆదర్శ విద్యార్థి యన నిట్టివాఁడే కదా !

మొదటినుండియు జవహరులాలునకు సాంఘిక వాదమనిన మిగులఁ బ్రీతి. దాని మూలసూత్రము లన్నిటి నాతఁడు సావధానముగఁ జదివి హృద్గత మొనరించుకొనెను. గోఖేలు, విపినచంద్రపాలు, లజపతిరాయి మున్నగు భారతదేశ నాయకు లింగ్లాండు వెడలి యచట నిచ్చిన యుప

న్యాసము లన్నిటిని జవహర్ మిగుల శ్రద్ధతో వినెను.

తండ్రి ఐ. సి. యస్. పరీక్ష చదువుమని సూచించి నను బ్రభుత్వసేవ యనినఁ గంటకించుకొనెడి జవహరుఁ డిచ్ఛగింపఁ డయ్యెను. తాను న్యాయవాది కావలెననియే యాతని కోరిక. ఆ కోరికతోడనే యతఁడు బారిష్టరు పరీక్షకుఁ జదువసాగెను. అపుడును కేవలము పఠనీయ పుస్తకములు చదువుటయే కాక జాతీయతను ప్రపంచాను భవమును, విజ్ఞానమును నభివృద్ధి చేసికొనుట కనువగు పొత్తము లెన్నియో చదివెను. తుదకు బారిష్టరు పరీక్ష యందు నెగ్గి వెంటనే స్వదేశమునకు మరలెను.

పాశ్చాత్య విద్యతోఁ బాటు మన జవహరునకు విజ్ఞానము, విశాలహృదయము, సర్వమానవ సౌభ్రాతృ త్వము, స్వాతంత్ర్యాభిలాష, యాత్మగౌరవము మున్నగు సుగుణము లలవడెను. తండ్రిగూడ పేరుగాంచిన న్యాయ వాది గాన జవహరునకు న్యాయవాద వృత్తికై పని వెదకి కొన నవసరము లేదయ్యెను. న్యాయవాదమునందుఁ దండ్రికి సంపూర్ణ సాయ మొనరించుచుఁ గొండొక కాల మా వృత్తి సాగించెను. కాని బాల్యముననే జాతీయ బీజము లంకురించిన యాతని మనమున కద్దానియం దభిరుచి లేకుండెను.

ఇందనుక జాతీయ మహాసభ మితవాదుల చేతులం దుండి సంవత్సరమున కొకసారి లాంఛనముగ నొకచో జరుగు చుండెను. మోతీలా లట్టి మితవాదులం దొకఁడు. కుమారు

నకు మాత్ర మిది గిట్టక సమయము దొరకినప్పుడెల్ల జాతీయ ప్రచార మొనరించు చుండెను.

ఇంతలో గాంధీమహాత్ముఁడు దక్షిణాఫ్రికాయందు స్వాతంత్ర్య సమరము సాగించెను. ఇచట జవహరులాలా యుద్యమముపట్ల నెంతయో సానుభూతిఁ జూపించెను. మిగుల శ్రమపడి రమారమి యేఁబదివేల రూప్యముల విరాళములు సేకరించి పంపెను. ప్రపంచ సంగ్రామానంతరము బ్రిటిషువారు తమ వాగ్దానములు నిలఁబెట్టుకొనరైరి. జాతీయ స్వాతంత్ర్య పోరాటమును బ్రచార మొనర్ప బాలగంగాధర తిలకు పూనాలోను, అనిబిసెంటు మదరాసులోను, హోము రూలు లీగులను స్థాపించిరి. వెన్వెంటనే జవహరులాలు రెంటి యందును సభ్యుఁడుగఁ జేరి జాతీయభావమును స్వయం నిర్ణయ సూత్రములను బ్రజాలోకమునఁ బ్రచార మొనరించెను. కొండొక కాలము భారతీయ హోమురూలు లీగునకుఁ గార్యదర్శిగ నుండెను. తండ్రియగు మోతీలాలు అలహాబాదు హోమురూలు లీగున కధ్యక్షుఁడుగ నుండెను. హిందూమహమ్మదీయ సామరస్యమునకై జవహరులాలు మిగులఁ బాటుపడెను. తన తండ్రి మితవాదుల ప్రార్థనా పద్ధతిని వదలి జాతీయోద్యమమునందుఁ జేరుటకై జవహరులాలు మిగుల యత్నించెను. 1916 లో జవహరుఁడు వివాహితుఁ డయ్యెను. భార్య కమల. ఆయమ మిగుల రూపవతి - లావణ్యవతి - విద్యావతి. దేశభక్తి యందు భర్త

కే మాత్రము తగ్గక జాతీయోద్యమమం దాయనకుఁ బ్రతి విషయమునను జేదోడు వాదోడుగ నుండెను. వివాహా నంతరము జవహరులాలు భార్యతో స్వదేశమగు కాశ్మీర మున కేఁగెను. అట నమరనాథ గుహను జూడఁబోయి మంచుగడ్డలపై కాలుజారి లోయలోఁ బడెను. కాని భగవ దనుగ్రహమునఁ బ్రమాదము దప్పెను.

క్రమక్రమముగ జాతీయమహాసభయందు మితవాదుల బలుకుఁబడి తగ్గి యతివాదుల ప్రాముఖ్యము హెచ్చు గాసా గెను. మోతీలాలు కుమారుని ప్రోత్సాహమునఁ బూర్తిగా నతివాది యయ్యెను. 1918 లో తండ్రి కుమారు లిద్దరును నొక పత్రికను స్థాపించి జాతీయప్రచార మొనర్పసాగిరి. ఆ పత్రిక పేరు "ఇండిపెండెంటు". అయ్యది ఆంగ్ల దినపత్రిక. జవహరు దాని కార్యకర్తలలో నొకఁడై యందు పెక్కు వ్యాసము లుత్తేజకరముగ వ్రాసెను. అతఁడు మితవాదుల భావము లను బూర్తిగ విమర్శించుచు, నతివాదమును బ్రచారించుచుఁ బత్రికానిర్వహణము మిగుల శ్లాఘ్యముగ నడపెను. అసహా యోద్యమ సమయమున నద్వితీయ దేశసేవ యొనర్చిన యీ పత్రిక రాజద్రోహకరమని ప్రభుత్వమువారు నిషేధించిరి. తండ్రి కుమారు లిరువురు న్యాయవాది వృత్తికి స్వస్తిచెప్పి కారాగారము నలంకరించిరి.

ఇంతలో రౌలటుచట్టమములునకు వచ్చుటయు, మహా త్ముఁడు సత్యాగ్రహోద్యమము ప్రారంభించుటయు జరిగెను.

దేశసేవయందు జేతినిండఁ బనిలేక యూరకొంటిఁగాక వేచియున్న జవహార్లాల్ డీ సత్యాగ్రహ సంఘమునందుఁ జేరఁదలచెను. కాని తండ్రి వారించెను. అంతట జలియన్ వాలాబాగు హత్యలు జరుగుటయు సంభవించెను. అంత మహాత్ముఁ డసహాయోద్యమము నకుఁ బ్రారంభోత్సవము చేయ దేశమునఁ దీవ్రాందోళనము బయలుదేరెను.

చిత్తరంజనుఁడు, మోతీలాలు, మహాత్ముఁడు మున్నగు న్యాయవాదు లొకసంఘముగ నేర్పడి దేశపరిస్థితులను విచారింపఁ బ్రారంభించిరి. ఈ విచారణ సక్రమముగను న్యాయముగను జరుపుటకై జవహరులాలు దేశీయమహాసభచే నియమితుఁడై యా విషయమున మిగులఁ బాటుపడెను. ఈ విచారణకతమునఁ బ్రజల నిర్దోషిత్వమును ప్రభుత్వపు దురుసుతనమును జక్కఁగ నిరూపింపఁబడెను. దీనితో మోతీలాలు మనమునందలి సందిగ్ధత పూర్తిగ వదలి యమృతసర దేశీయ మహాసభ కధ్యక్షుఁడై యద్దానిని సంపూర్ణ జాతీయముగా మార్చెను.

తదాది జవహరుఁ డేటేట దేశీయమహాసభకేగి తప్పక పాల్గొనుచుండెను. క్రమక్రమముగఁ దండ్రికిఁ గుమారుని తీవ్రపద్ధతులపైఁ గల నిరసనము తొలఁగెను. తదాది తండ్రి కుమారు లిరువురు తమ సర్వస్వమును దేశసేవకే వినియోగింప సమకట్టిరి. నిర్మాణకార్యక్రమమున కండలై నిలచిరి. అంతటఁ గుటుంబ మంతయు వారి మార్గమునే

యవలంబింప సాగిరి.

ఇంగ్లాండున విశేషకాల ముండుటవలన నితను జవహారు వేసవియందు పర్వత ప్రాంతములఁ గడుపువాఁడు. ఒక సంవత్సరము తల్లియు భార్యయు నస్వస్థతగ నుండుటచే జవహారులాలు వారితో మసోరి పట్టణమున కేఁగెను. ఆ సమయమున నాఫ్గను రాయబారులు మన ప్రభుత్వముతో నేవియో రాజకీయ విషయములను గూర్చి మంత్రాంగ మొనర్చు చుండిరి. జవహారులాలు వారితో మాటలాడిన దమకొంప కెసరు వచ్చునని భయపడి ప్రభుత్వమువా రాతని నటనుండి యొట కేని యేఁగుమని యాజ్ఞ నిచ్చిరి. అది కారణముగ నతఁడు ప్రయాగ కేఁగెను. కాని ప్రజాహిత తత్పరుల కెచట పని లేకుండును!

అయోధ్య ప్రాంతపు రైతులు జవహారు నొద్దకు వచ్చి యార్థిక సంబంధమగు తమ చిక్కులను జమీందారుల యొత్తిడిని గూర్చి యాతనితో మొరపెట్టుకొనిరి. వెంటనే యాతఁడు నడుము బిగించి వారి యిక్కట్టుల స్వాయముగ విచారింపఁ దలఁచికొని వారికి జాతీయభావ ముద్బోధించెను. అంతటనుండి కార్మిక కర్షకుల నుద్ధరించుటయే ప్రధానాశయముగ నేర్పఱచుకొనెను. జాతీయవాది క్రమముగ సాంఘికవాది కాసాగెను.

వేల్సు యువరాజు రాక సందర్భమున స్వచ్ఛంద దళముల నేర్పఱచి హరటాలు జయముగ సాగించిరని తండ్రి కుమారుల నిఱువురను ప్రభుత్వము నిర్బంధించెను. వారు

తమ విచారణయందు వాదింపరైరి. జవహారుఁడు మూఁడు నెలల శిక్ష యనుభవించిన పిమ్మట నభియోగము నిరాధార మని యాతనిని వదలిరి. కాని కార్యదీక్షగల జవహారుఁ డూరకొనక ఇలుచేరి స్వాతంత్ర్యాగ్ని చల్లారకుండుటకై స్వచ్ఛందదళముల నభివృద్ధి చేయసాగెను.

ఇంతలో విదేశవస్త్ర బహిష్కరణ మమలునకు వచ్చి జవహారు నతని కుటుంబమువారును విదేశవస్త్ర విక్రయ శాలలయొద్ద పికిటింగు తీవ్రముగ సాగించిరి. మద్యపాన నిషేధమునకై మద్యవిక్రయ శాలలయొద్ద పికెటింగు సాగించిరి. దాని కంతయు కారకుఁడు జవహారే యని యతని భార్యను సోదరిని గూడఁ గారాగారమం దుంచిరి. కారాగార వాసమునను జవహారుఁ డూరకొనక రాట్న ముపై నూలువడుకుచు సద్గ్రంథపఠన మొనరింపుచు దేహ పరిశ్రమ సేయుచు గాలముఁ గడపెను. సత్యాగ్రహము కారణాంతరముల వలన తగ్గగనే జవహారుఁడు విముక్తి గాంచెను. కాని యతని కార్యదీక్ష యినుమడించి సంయుక్త రాష్ట్రీ కాంగ్రెసుకుఁ గార్యదర్శిగ నుండి జిల్లాకాంగ్రెస్ సంఘముల నభివృద్ధిచేసి కట్టుదిట్టము లొనరించెను. దేశీయ మహాసభయందుఁ గల నిరుపక్షములకును సమాధానము గూర్చి తానే కార్యదర్శిగ నుండి నిర్మాణ కార్యక్రమమును వృద్ధిపఱచెను. రాజకీయ తత్త్వము ప్రజల కుద్బోధించి తగిన కార్యక్రమమును నేర్పఱచెను.

మన దేశమునందు నాభా పాటియాలా యను రెండు స్వదేశరాష్ట్రములు గలవు. ఇవి రెండును నిరుగు పొరుగు రాజ్యములే. ఇరువురు రాజులును సిక్కులే. కాని నాభా రాజు ప్రజాహిత కార్య తత్పరుఁడు. పాటియాలా రాజు ప్రజాపీడన నిరతుఁడు. ఇరువురకును గలహము వాటిల్ల బ్రిటిషువా రందు జోక్యము కలిగించుకొనిరి. నాభారాజును బదచ్యుతునిఁ జేసి దేశమునుండి వెడలనడచిరి. ప్రజల కది యెట్లు సమ్మతమగును! దీనికితోడు గురుద్వార విషయమునఁ బ్రభుత్వమునకు నకాలీలకును నభిప్రాయభేద మేర్పడి యకాలీలు జట్లుజట్లుగా సత్యాగ్రహ మొనరింపఁ బ్రభుత్వము వారు వారిని నిర్బంధింపసాగిరి.

దీనిని విచారించుటకే జహ్వారు గిద్వాని, సంతానము గారలతోఁ గలసి సరిహద్దున కేఁగఁగనే నాభా యుద్యోగులు వారిని నిర్బంధించి కారాగారమునం దుంచిరి. మోతీలాలు జహ్వారు నిర్బంధముగూర్చి విని యాతని క్షేమము దెలుపుమని రాజప్రతినిధికిఁ దంత్రీవార్త నిచ్చినను జవాబు రాదయ్యెను. తుదకు జవహరుని ప్రభుత్వము నాభా సరిహద్దులఁ దిగవిడిచి లోనఁ బ్రవేశింపరాదని శాసించెను. మరల నందు బ్రవేశించుటకు కాంగ్రెసు నాజ్ఞ లేమి జహ్వారుఁ డూరకొనెను.

కాంగ్రెసువారు స్థానిక సంస్థలందుఁ జేరవచ్చునను నాజ్ఞనీయ నాయకు లందుఁ బ్రవేశించి ప్రజాహిత కార్యము

లోనర్పసాగిరి. తత్కారణమున జవహరుఁ డహమ్మదా బాదు పురపారిశుద్ధ్య సంఘమున కధిపతియై ప్రజాహిత కార్యము లెన్నియో నొనర్చెను. దాని యాదాయము నినుమడింపఁ జేసెను. ప్రభుత్వమువారు సైత మాతని సేవను, ప్రతిభను, గార్యనిర్వాహణ దీక్షను వేనోళ్ళఁ బొగడిరి. అచట స్వేచ్ఛ లేమిఁగాంచి కొన్నాళ్ళకు జవహరుఁ డా పదవినిఁ ద్యజించెను. ఇతఁ డా పదవియం దుండఁగనే పుష్కరము రాఁగ త్రివేణి సంగమమునఁ బ్రజలు స్నానము చేయరాదని ప్రభుత్వము శాసించెను. జవహరుఁడు పుష్కరిణికిఁ బ్రజల కెన్నియో సదుపాయము లొనర్చి మాలవ్యాతోఁ గూడి ప్రజల వాంఛ నెరవేరునట్లు సలిపెను.

ఆహా! జహ్వారుని కార్యదీక్షఁ జూడుఁడు. భార్య యారోగ్య రక్షణార్థము స్విట్జర్లాండున కామెను దీసికొని పోయెను. అట వృథాకాలయాపన మొనరింపక యచటి యుద్ధానంతర కార్యనిర్వాహణమును నార్థిక రాజకీయాది విషయములను కార్మిక సమస్యలను జక్కఁగ బరిశీలించెను. విజ్ఞాన రసాయన శాస్త్రములం దవలంబింపఁబడు నూతన మార్గములఁ బరిశీలించి యయ్యవి మనదేశమున కెంతవఱ కుపయోగించు నను విషయము నాలోచించెను. వివిధ దేశములందలి రాజ్యతంత్ర నిపుణులనుఁ బత్రికా సంపాదకులను, కార్మిక కర్షక నాయకులను కలసి పెక్కు విషయములు వారితోఁ జర్చించెను. మనదేశమును గుఱించి

యచట జరుగు నసత్య ప్రచారములను ఖండించి యథార్థ స్థితిని వెల్లడించెను.

జవహరులా లచటనున్న సమయమున బ్రుసెల్సు నగరమున నఖిల ప్రపంచమందలి పీడిత జాతుల మహాసభ జరిగెను. అందతఁడు పాల్గొని మన దేశ స్థితిగతుల గూర్చి చక్కని యుపన్యాస మిచ్చెను. సభ్యులందఱతని వాగ్ధోర ణిని జూచి యాశ్చర్యచకితులైరి. అట నేర్పడిన సామ్రాజ్య తత్త్వ నిరోధక సభయం దితని సభ్యునిగఁ జేర్చుకొనిరి.

అనంతరము రష్యా విప్లవ వార్షికోత్సవమున కితఁ డాహూతుఁ డయ్యెను. అతఁడు సకుటుంబముగ రష్యా చేరి యా యుత్సవమందు బాల్గొనెను. మన దేశమున దేశీయ మహాసభ జరుగ నుంటచే వెంటనే యాతఁడు భార్యతోఁ గూడ నింటికే తెంచెను.

కాలక్రమమున జవహరులాలు సంపూర్ణ స్వాతంత్ర్య వాదియై బోసుబాబుతోఁ గలిసి సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానము దేశీయ మహాసభయందు నెగ్గునట్లు చేసెను. దేశీయ మహాసభ యందలి వివిధ పక్షముల సమన్వయింప గల నేత జవహరులా లొక్కఁడే. దేశమున నావరించిన మాంద్యమును దొలగించి యుత్సాహపూరితమగు కార్య క్రమమును బ్రవేశపెట్టఁగల కార్యవాది యాతఁ డొక్కఁడే.

సైమను కమీషను రాక సందర్భమున హర్తాళము జయప్రదముగ సాగించినందున జవహరుఁడే కాక యాతని

తల్లి మొదలగు నబలలు గూడ లాఠీ దెబ్బలకు గుఱియైరి. జవహర్లాల్ ఱిట్లు సంపూర్ణ స్వాతంత్ర్య శంఖారావమును దేశము నలుగడల మాఱుమ్రోగించుచు కార్మిక కర్షక సమస్యలందుఁ బాల్గొనుచుఁ దుదకు ట్రేడుయూనియన్ కాంగ్రెసున కధ్యక్షుఁ డయ్యెను. తదాది నాతఁడు సోషలిజ మును గూర్చి ప్రచార మొనరించుచు సామ్యవాద సిద్ధాంత ముల బోధించుచుండెను.

జవహర్లాలు చిన్నవయసుననే దేశీయ మహాసభ కధ్యక్షత వహింపఁ గల్గెను. అధ్యక్షోపన్యాసమునఁ దన సిద్ధాంతముల నన్నిటినిఁ దేటతెల్ల మొనరించెను. ఉప్పు సత్యాగ్రహమునఁ బ్రజలు జట్లుజట్లుగ శాసనోల్లంఘన మొనరించి నిర్బంధమునకు గుఱియగుచుండిరి. మన జవహ రుఁడును నొక జట్టునకు నాయకుఁడై యాఱుమాసములు కారాగార శిక్ష విధింపఁబడెను. ఈతని ప్రోత్సాహమునఁ దండ్రి మోతీలాలు విశాలమగు తన యానంద భవనమును దేశీయ మహాసభకు శాశ్వతముగ నిచ్చివైచెను. అటనుండి యది స్వరాజ్య భవనమని పిలువఁబడుచు నందు కాంగ్రెసు కార్యవర్గ సభలు జరుగుచుండెను.

శిక్షాకాలము పూర్తియైన పిమ్మట జవహర్లాలు విడువఁబడెను. అతఁ డంతట నాగక తండ్రికి జబ్బుగనున్నను నింటనుండ నిచ్చగింపక పన్నుల నిరాకరణోద్యమమునందుఁ బాల్గొనెను. మరల ప్రభుత్వ మాతనిని శ్రీకృష్ణజన్మస్థాన

మున కంపిరి. కాని సప్రూ జయకరులు కూర్చిన సమా ధానము ననుసరించి మరల విముక్తిఁ గాంచెను. అంతఁ దండ్రి యనారోగ్యము హెచ్చి శయ్యాగతుఁడై యెంత మంచి చికిత్స జరిగినను నాతఁడు దివంగతుఁ డయ్యెను. తండ్రికి పరలోకక్రియలు పూర్తియైన వెంటనే జవహ్వారుఁడు ఢిల్లీకేగి గాంధి-ఇర్విన్ సంధియెడఁ దనకుఁ గల యసంతృప్తిని వెల్ల డించెను. పిమ్మట కరాచీ కాంగ్రెసుకుఁ బోయి యువక, కార్మిక, కర్షక పక్షముల నవలంబించి ప్రాథమిక హక్కుల తీర్మానము నెగ్గించెను.

నిరంతర ప్రచారమువలన జవహ్వారునకు శరీరారోగ్యము చెడి విశ్రాంతికొఱకు సింహళ మేగెను. కాని యచటను నూరకొనక యటనుండి మలయా మున్నగు ప్రదేశముల కేగి జాతీయ ప్రచార మొనరించెను. ప్రభుత్వమువారి నిషే ధపుటాజ్ఞ నుల్లఘించి బొంబాయి చేరెనని మరల నొకసారి నిర్బంధింపఁబడెను. దేశమున సాత్వికనిరోధ మేర్పడి పన్నులు చెల్లించనందున జవహ్వారు మొదలగువారి యాస్తులు జప్తు చేయఁబడెను. తల్లి యనారోగ్య కారణమున నాతఁడు మరల విముక్తుఁ డయ్యెను.

హరిజనోద్యమము పట్లను బీహారు భూకంప విష యమునను నాతఁడు మిగుల శ్రమపడెను. కలకత్తాయందు రాజద్రోహాకరమగు నుపన్యాస మిచ్చెనని యతఁడు మరల నిర్బంధింపఁ బడెను. కారాగారమం దుండఁగనే భార్యకు

నారోగ్యభంగమయి యీనరకుఁ జెప్పినట్లు స్విట్జరులాండు నకుఁ దీసికొనిపోఁబడెను. అది కారణముగ జవహరుఁడు విడుదల యయ్యెను. అతఁడు వాయువిమానమున నేగి భార్యను గలిసికొనెను. ఆమెకు స్వాస్థ్యము కొంచెము చేకూరగనే తాను విదేశ ప్రచారము మొదలిడెను. ఆ సమయమున భార్య యాతని విచారసాగరమున ముంచి పరమపదించెను. పిమ్మట నామె జ్ఞాపకార్థ మలహాబాదునం దొక వైద్యశాల స్థాపించిరి.

ఇట్టి చింతాసాగరమున నీదుచుండియు జవహరుఁడు సింహళమేగి శ్రమపడి యచటి రాజ్యాంగ విధానమునందు మార్పు తేఁగలిగెను. అటనుండి చైనా జపాను దేశముల కేగి మహోపన్యాసము లిచ్చి వారి మన్నన లంది గొప్ప యంతర్జాతీయ నాయకుఁ డయ్యెను.

ఇట్టి నిష్కలంక సేవయు, నిరుపమాన త్యాగమును, నంతర్జాతీయ ప్రసిద్ధినిఁ బట్టి నేఁడాతఁడు హిందూస్థానమునకుఁ బ్రధానమంత్రియై స్వదేశ వ్యవహారములనే గాక దేశాంగ వ్యవహారములను గూడ మిగుల చాకచక్యముగ నడుపు చున్నాఁడు. దేశ పరిస్థితులను వేయికన్నులఁ గనిపెట్టు చున్నాఁడు.

జవహరులాలు భారతదేశ ప్రధానియైన పిమ్మటఁ బ్రపంచమున భారతదేశ ప్రతిష్ఠ హెచ్చెను. అంతర్జాతీయ ఆర్థిక మహాసభకును సాంఘిక మహాసభకును నధ్యక్షస్థాన

మలంకరించుచున్నది భారతీయులే.

ఆటంబాంబును గూర్చి పాశ్చాత్య జాతులలోఁ బ్రతిష్టంభన మేర్పడినపుడు కొంతవఱకైన రాజీ కుదర్పఁ గలిగినది భారత రాజకీయ వేత్తయే. ఐక్యరాజ్య సమితియు నైర్లండు పార్లమెంటును భారతీయునిఁ బ్రత్యేకముగ గౌర వించినవి. అట్టి గౌరవ మందఁ జాలినది మన జవాహరుఁడే. జవాహరుని నాయకత్వమున భారత దేశము ప్రపంచ మంత టకిని నాశా సందేశమును స్నేహ సందేశమును నందించు చున్నది. ఏకైక నాయకుఁడగు జవాహరుఁడు భారత దేశ మన్ని దేశములతో స్నేహముగ నుండుననియు, స్వాతం త్ర్యము గోరు దేశములకు సాయ మొనర్చుననియు బెక్కు సారులు చాటెను.

డచ్చివారివలన బాధపడుచున్న ఇండోనీషియాను గుఱించి ఐక్యరాజ్య సమితియందు జవాహరుండు సంచలనము దెచ్చెను. ఆతఁడు శాంతిభద్రతలు గోల్పోయిన బర్మాకు సహాయము జేయ నిశ్చయించెను.

కొరియా విషయమున మిగుల నిష్పక్షపాతముగఁ జరించుచుండెను. పాకిస్థాను స్నేహమునకై యెప్పటికప్పుడు చేయి యందించుచుండెను. కాశ్మీర విషయమున మిగుల నప్రమత్తుఁడై మెలఁగుచుండెను. ఆసియా దేశముల నన్నిటి నాహ్వానించి ఢిల్లీయందు సమావేశపఱచి ప్రాదేశిక సమస్యల నన్నిటిని విపులముగఁ జర్చించెను. ఈతని నాయకత్వముననే

మన దేశము ప్రాగ్దేశములకే కాక ప్రపంచ మంతటికి నాయకమణి యగునని యాశింతము.

జవహర్లా డిట్లు విదేశాంగ రాజనీతియందును స్వదేశ వ్యవహారములందును తన యసమాన ప్రతిభను గన్పఱచుచు భారతప్రధాని పదవినే కాక జాతీయ మహాసభాధ్యక్షు పదవిని గూడ నిర్వహించుచుండెను.

మనకు స్వాతంత్ర్యఫల మబ్బి యేడెనిమిది వత్సరములే యైనను మన ప్రధాని మన దేశమును చాల నభివృద్ధికి దెచ్చెను. స్వాతంత్ర్య మబ్బిన ప్రథమ దివసములందు మన దేశ మాహార విషయమునను వస్త్ర విషయమునను స్వయం పోషకముగ లేకుండెను. ఆ సమయమున నాహార వస్త్రములకు 'కంట్రోలు' ళ్ళుండెను. మన జవహర్లాలుడు తన ప్రతిభా వ్యుత్పన్నతల వినియోగించి ప్రథమ పంచవర్ష ప్రణాళికయు, ద్వితీయ పంచవర్ష ప్రణాళికయు నేర్పాటొనర్చెను. ప్రథమ పంచవర్ష ప్రణాళికయందు హీరాకుడ్, దామోదరలోయ, నందికొండ, తుంగభద్ర మున్నగు డాములు ప్రాజెక్టులు పెక్కులు నిర్మించియు, పరిశ్రమల నానాముఖముల వృద్ధి జేసియు దేశము నాహార వస్త్ర విషయమున స్వయంపోషక మొనర్చెను. ద్వితీయ పంచవర్ష ప్రణాళికయందు కుటీర పరిశ్రమల నభివృద్ధిజేసి ప్రజలకు నిరుద్యోగ సమస్యయు, విద్యాశాలల వృద్ధిజేసి దేశమునందలి అవిద్యా సమస్యయు దీర్పనెంచెను. దేశము నన్ని విధముల స్వయం సమృద్ధ

మొనర్చ సమకట్టెను.

విదేశ వ్యవహారములందును జోక్యము కలిగించుకొని యంతర్జాతీయముగ తాను ప్రముఖపాత్ర వహించుటచే లోక ప్రపంచ దృష్టియందు భారత ప్రతిష్ఠ నినుమడింపఁ జేసెను. పాశ్చాత్య దేశములం దగ్రరాజ్య చతుష్టయము సభలు జరిపి ప్రపంచ శాంతికై ప్రయత్నించుచుండ, జవహరులాలు ప్రాచ్య ఖండములం దాగ్నేయాసియా సభలు జరిపి, పంచశీల మున్నగు సూత్రము లేర్పఱచి శాంతియత్నము లొనరించు చుండెను. కొరియా, చైనా, కాశ్మీరము, నైజాము, గోవా మున్నగు సమస్యలందు మిగుల చాకచక్యముగ బ్రవర్తించి తన వ్యక్తిత్వమును నిలబెట్టుకొని రాజకీయము లందు తనకుఁ గల దూరదృష్టిని బ్రకటించు కొను చుండెను. ప్రపంచమున శాంతిదూత యనియు మహాత్మునకు తగిన శిష్యుఁ డనియు బేర్గాంచెను. జవహరుఁ డిటీవల పెక్కు విదేశ పర్యటన లొనరించెను. ఈ పర్యటన లందు అమెరికా, రష్యా, యుగోస్లేవియా మున్నగు విదేశ రాష్ట్రము లాతనికి ఘనస్వాగత మిచ్చి, పెక్కు మర్యాద లొనర్చి, బ్రహ్మరథము పట్టి, బ్రహ్మాండములగు నూరేగింపులు నుత్సవము లొనరించెను. ఈ మహామహుని కారణమున మన భారతమాతృ ప్రతిష్ఠ యింకను వృద్ధినై, మన దేశ గౌరవ మినుమడించునని మన మూహింపవచ్చును.

ఇట్టి జవహరులాలు చిరాయు రారోగ్య భాగ్యము లంది భారత ప్రతిష్ఠ నినుమడింపఁ జేయుగాత మని పరమేశ్వరుని హృదయపూర్వకముగఁ బ్రార్థింతము.

# బాబు రాజేంద్ర ప్రసాదు

బాబు రాజేంద్రప్రసాదు భారత జాతీయ నాయకులం దగ్రగణ్యుడు. ప్రతిభ, ఔదార్యము, ఋజువర్తనము, త్యాగము, దేశసేవ, మానవసేవ యీతనికిఁ బ్రకృతిజన్య గుణములు. కీర్తికాంక్ష లేని నిరాడంబరుఁడు. ప్రాపంచిక భోగముల నొల్లక దారిద్ర్యదేవత స్వేచ్ఛగా వరించి యాత్మార్పణ మొనర్చిన త్యాగమూర్తి. ఇట్టి యాదర్శ జీవితము ప్రతివారును బఠింపఁ దగినది.

ఈ నాయకోత్తముఁడు కాయస్థకులజుఁడు. ఈయన 1884 వ సంవత్సరమున డిశెంబరు మూఁడవ తేదీన జన్మించెను. తండ్రి మహాదేవ సాహె. వంశ ముస్నత వంశము. తాత ముత్తాతలు దివాను మున్నగు నున్నత పదవు లలంకరించిరి. మహాదేవున కైదుగురు సంతానము. రాజేంద్రుని యన్న మహేంద్ర ప్రసాదు సుప్రసిద్ధుఁడు.

ప్రారంభమున రాజేంద్ర ప్రసాదు మౌల్వీల నొద్దను బండితులకడను బారసీ, సంస్కృతము మున్నగు భాష లభ్యసించెను. పిమ్మట ఛప్రామాండలికోన్నత పాఠశాలయందు నాల్గవ తరగతియందుఁ జేరెను. ఐదవతరగతి చదువుచుండఁగనే యాఱవ తరగతియందుఁ జేరఁ గలిగెను. ఆఱవ, యేడవ తరగతు లచటఁ జదివి హాథువా యెస్టేటు హైస్కూలులో మూఁడవ ఫారమునందుఁ జేరెను. ప్రవేశపరీక్ష వఱకచ్చ

టనే చదివెను. ఇప్పటివలెనే విద్యార్థి దశయందును నారోగ్యము సరిలేనందున నాతని విద్యలకుఁ బెక్కు లంత రాయములు కలిగెను. మానసిక బలము నొసంగిన మూల మైనను ప్రసాదునకు శారీరక బలము ప్రసాదింపఁ డయ్యెను. కుశాగ్రబుద్ధి కాన సెట్లోని ప్రవేశ పరీక్షయందే ప్రథముఁడుగ నుత్తీర్ణుఁ డయ్యెను. అది కారణముగ ఎఫ్. ఏ. పరీక్షయందు విద్యార్థి వేతనము వడయఁ గల్గెను. మానసిక పరిశ్రమయం దున్న మక్కువ యాతని కిప్పటికిని దేహపరిశ్రమయందు లేదు. ఇప్పు డెంత నిరాడంబర వేషమో, విద్యార్థి దశయం దును నాతని కంత నిరాడంబర వేషమే. నవనాగరిక విద్యార్థులవలె నాతనికి హాటు, బూటు, సూటులపై నభిలాష లేదు. అట్లే ఎఫ్. ఏ., బి. ఏ. పరీక్షలందును బ్రథముఁడు గనే యుత్తీర్ణుఁ డయ్యెను.

'పూవు పుట్టగనే పరిమళించు' నన్నట్లు రాజేంద్ర ప్రసాదునకు విద్యార్థి దశయందే మానవసంఘ సేవాబీజము లంకురించినవి. అప్పుడే 'డానుసొసైటీ' యను సంఘసేవా సంస్థయందు జాల్గొని 'డాన్' అను పత్రికయందుఁ బెక్కు లుత్తమ వ్యాసములు రచించెను. ఈ పత్రిక మూలమున నతండు స్వదేశవస్తుప్రచారమును విదేశవస్తు బహిష్కరణ మును బ్రోత్సహించెను. అప్పటినుండి యిప్పటి వఱకును రాజేంద్రుఁడు సాధ్యమైనంత వఱకు విదేశ సంబంధమగు చిన్న వస్తువైనను వాడి యెఱుంగఁడు. ఈ విధముగ బి. ఏ.

పరీక్షకుఁ జదువుచునే యాతఁడు గొప్ప ప్రజాసేవయు దేశ సేవయు నొనరించెను. అది గ్రహించినవా రతఁడు భారత భవిష్యన్నాయకాగ్రణి యగునని సూచించిరి. అట్లే జరిగెను.

బి. ఏ. పట్టము గ్రహించిన వెనుక రాజేంద్రుఁడు బారిష్టరు చదువ నింగ్లండున కేగఁదలంచెను. కాని యని వార్యములగు కారణాంతరముల వలన నది సాగినది కాదు. కనుక ఎం. ఏ. చదువ నారంభించి యనతికాలమున నుత్తీర్ణుఁ డయ్యెను. అది చదువుచునే సూక్ష్మబుద్ధి యగు నాతఁడు న్యాయశాస్త్రాభ్యసనము గూడ నొనరించెను. తదనంత రము న్యాయశాస్త్ర పరీక్షయం దుత్తీర్ణుఁ డయ్యెను. కలకత్తా ఉన్నత న్యాయస్థానమందు న్యాయవాదిగఁ జేరెను.

తోడి న్యాయవాదు లందఱు రాజేంద్రుని ప్రతిభ జూచి ముక్కుపై వ్రేలిడికొనిరి. కలకత్తా విశ్వవిద్యాలయమువా రతనిని న్యాయశాస్త్రమునం దాచార్యునిగ నియమించిరి. న్యాయవాదిగ నున్నపుడే యం. ఎల్. పరీక్షయందుఁ గూడ బ్రథమునిగ నుత్తీర్ణుఁ డయ్యెను. పిమ్మట పాట్నా ఉన్నత న్యాయస్థానమున న్యాయవాదిగఁ జేరి నెలకు రమారమి మూఁడువేలు సంపాదింపఁ గలిగెను. ఎంత గణించినను నుదార మనస్కుల ద్రవ్యము పరోపకారార్థమే కదా! తన సంపాదనయందు చిల్లిగవ్వ యైనను వెనుకవైచెడివాఁడు కాడు. బీద విద్యార్థుల యాహార పానీయములకొఱకే కాక జీతములకుఁ గూడ వ్యయించెడివాఁడు. పండితులకు దేశ

సేవకుల కెందఱకో నిరంతర మాతిథ్య మిచ్చుచుండెడివాఁడు. ఇట్లు తాను గడించిన దంతయుఁ బరోపకార కార్యములకే వ్యయ మొనరించెడివాఁడు.

ఇంతలో మహాత్ముఁడు సత్యాగ్రహోద్యమము ప్రారంభింప రాజేంద్రుఁడు తత్క్షణ మందుఁ జేరెను. నాఁటినుండి చిరకాలము మహాత్మునకుఁ గుడిభుజమై యాతని యాంతరంగికులలో నగ్రగణ్యుఁడుగ నుండెను. రెండవ మహాత్ముఁడనఁ బరిగెను. తొలుదొల్త స్వరాష్ట్రమగు బీహారునందు నీలిమందు పొలములలోఁ బనిచేయు పారిశ్రామికుల నుద్ధరింపఁ దలఁచెను. ఆ సమయమునఁ బ్రభుత్వము మహాత్ముని బీహారు ప్రవేశింపరాదని శాసించెను. మహాత్ముఁ డిద్దానిని ధిక్కరింపఁ బ్రభుత్వము కఠినచర్య నవలంబించెను. ప్రజాందోళన ప్రారంభ మయ్యెను. దాని ఫలితముగ మహాత్ముని వదలిరి. చంపరాను పారిశ్రామిక చట్ట మమలునకు వచ్చి పారిశ్రామికుల కెంతయో యుపకృతి జరిగెను. ఈ ఘట్టమున రాజేంద్రబాబు న్యాయస్థాన వ్యవహారము లన్నింటిని వదలి మహాత్మున కెంతయో యండగ నుండెను.

పిమ్మట సహాయ నిరాకరణోద్యమ సమయమున బీహారు రాష్ట్రమునకు రాజేంద్రప్రసాదు ప్రధాన నాయకుఁ డయ్యెను. విద్యార్థులు ప్రభుత్వ విద్యాలయములు వదలివైచిరి. రాజేంద్రుఁడు పాట్నా విశ్వవిద్యాలయము లందలి సభ్యత్వమునకు రాజీనామా యొసఁగెను. జాతీయ విద్యను

ప్రోత్సహింప సమకట్టి జాతీయ విశ్వవిద్యాలయము నొకదానిని స్థాపించెను. దానికి బీహారు విద్యాపీఠమని పేరిడెను. అందు విద్యార్థులు తండోపతండములుగఁ జేరి జాతీయవిద్య నభ్యసించిరి. శాసనోల్లంఘన సమయమునఁ బనికివచ్చు వేల కొలఁది దేశసేవకుల నీ విద్యాపీఠము తయారు చేసెను. ప్రభుత్వమునకుఁ గన్నుగుట్టి యయ్యది యక్రమ సంస్థ యని ప్రకటించి యణచివైచెను.

బీహారు రాష్ట్రమునఁ గాని, తదితర ప్రదేశములందు గాని వరదలు, భూకంపములు వచ్చి ప్రజలు బాధపడునప్పు డెల్ల మానవ సేవానిరతుఁడగు రాజేంద్రుఁడు నడుముకట్టి దీనజనుల పాలిటి కల్పతరు వగుచుండెను. 1924-వ సంవత్స రమున బీహారు రాష్ట్రమున నదివఱకు కని విని యెఱుఁగని గొప్ప భూకంపము సంభవించెను. వందలకొలఁది గృహ ములు కూలెను. వేలకొలఁది ప్రాణులు నశించెను. లక్షల కొలఁది యాస్తి నష్టమయ్యెను. ప్రజ లన్న వస్త్రములు లేక 'అలో లక్ష్మణా' 'అన్నమో రామచంద్రా' యని విలపింప సాగిరి. రాష్ట్ర మంతయు శ్మశానప్రాయ మయ్యెను. ఇది సంభవించిన రెండు దినములకు రాజేంద్రబాబు అనారోగ్య కారణమునఁ గారాగార విముక్తుఁ డయ్యెను.

వెనువెంటనే తన యారోగ్యమును లెక్కింపక, వైద్యుల సలహాను మన్నింపక కార్యరంగమున కురికెను. ఈ ఘట్టమున రాజేంద్రబాబు ప్రతిభయుఁ బలుకుఁబడియుఁ

గార్యదీక్షయు మానవ సేవాభిలాషయు దీనజనోద్ధారణ తత్పరతయు జగద్విదితము లయ్యెను. ఈ సమయమున రాజ ప్రతినిధులకు సమానముగా రాజేంద్రప్రసాదు నిధి యను పేర నాతఁడు రమారమి ముప్పది లక్షలు సేకరింపఁ గలిగెను. ఈ నిధితో నాతఁడు స్వయముగ వస్త్రహీనులకు వస్త్రము లును, సన్నాతురుల కన్నమును నిడి శిథిలభాగముల నెన్నిటినో పునర్నిర్మాణ మొనరింపఁ జేసెను. దేశీయమహా సభ పదవీస్వీకారమున కనుమతించినపుడు సైతము తాను మంత్రిపదవి కాశింపక తన స్వార్థత్యాగమును జూపెను.

విద్యార్థిదశయందే దేశీయమహాసభల కరుగుచు నందు స్వచ్ఛంద సేవకుఁడుగఁ బనిచేయుచుఁ గాలక్రమమున దాని కధ్యక్షుఁ డయ్యెను. రెండుసారు లధ్యక్షుఁ డగుటయే కాక చాలకాలము కార్యవర్గ సభ్యుఁడుగను కొంతకాలము ప్రధాన కార్యదర్శిగను నుండి యపారమగు దేశసేవ యొనర్చెను. కాంగ్రెసు సంస్థయందు భిన్నపక్షము లేర్పడి తీవ్ర భేదాభి ప్రాయములలోఁ గూడిన క్లిష్టసమయములందుఁ గూడ నీతఁడు మహాసభా కార్యక్రమమును మిగులఁ జాకచక్య ముగ నడపెను.

తదితర భారతనాయకుల వలె నీతఁడు చిఱుత ప్రాయమున నింగ్లండున కేగఁ దటస్థింపలేదు. తన నలుబది నాల్గవయేట న్యాయవాదవృత్తి ననుసరించి యొక యభి యోగ సందర్భమున లండను నగరమున కేఁగెను. ఈ విదేశ

యాత్రయం దితఁడు కొందరు విదేశ నాయకులను కలిసికొని రాజకీయాది విషయములు చర్చించెను. మన దేశమునకు రాఁగనే తా నచట గడించిన యనుభవముల నొక గ్రంథ రూపమునఁ బ్రచురించెను. అచటి పరిస్థితులుగాని, యా ప్రజల శాంతివిముఖత గాని, దౌర్జన్య పద్ధతులు గాని ప్రసాదున కెంతమాత్రము నచ్చ లేదు.

రాజేంద్రప్రసాదు జీవిత మెంత నిరాడంబరమో యాతని యుపన్యాసము లంత నిరాడంబరములు. అతని వేష మెంత నిరలంకారమో వాగ్ధోరణియు నంత నిరలంకారము. తాను ఘనపండితుఁ డయ్యును పామరుల కవగత మగునట్లు హృదయమిచ్చి మాటలాడఁ గలఁడు. తన వాదన నైపుణితో నెంత ప్రబల ప్రతిపక్షుల నైన సులభముగ లొంగదీసికొనఁ గల శక్తి యాతనికడఁ గలదు. కాని యెట్టి తీవ్రవాదమం దైన నెదుటి పక్షమువానికి గౌరవభంగము కాకుండ వాని మనసు నొప్పింపకుండ, నెదరి భావముల శాంతముగ గ్రహించి మన్నించును.

బీహారు రైతులు జమీందారుల యొత్తిడి పడలేకయు, మితిలేని పన్నుల భారమునఁ గ్రుంగియు మిగుల నగచాట్లు పడుచుండ రాజేంద్రప్రసాదు వారి కష్టములఁ గట్టెక్కించుటకై తన యావచ్ఛక్తిని వినియోగించెను. "కిసాను" ఉద్యమము నెంతయో ప్రోత్సహించెను.

మహాత్ముని నిర్మాణ కార్యక్రమమునందు రాజేంద్రుఁడు

తీవ్రకృషి యొనర్చని యంశమే లేదు. కాంగ్రెసునం దొక పక్షము శాసనసభాప్రవేశమున కంగీకరించి పనిచేయుచుండ, వేఱొక పక్షమున నిర్మాణ కార్యక్రమమున నిమగ్నమైనది. ఈ పక్షమువారిని 'అపరివర్తనవాదు' లందురు. అందు రాజేంద్రుఁ డగ్రగణ్యుఁడు. గాంధి సేవాసంఘు సిద్ధాంతముల నీతఁడు తు. చ. తప్పకుండ ననుసరించెను.

బీహారమంతయు రాజేంద్రుని మాట శిరసావహించును. రాజేంద్రప్రసా 'దపరివర్తనవాది' కాన బీహారమందే కొలఁది మందియో తప్ప మిగిలిన వారంద 'అపరివర్తనవాదు' లే. కాఁగా వారెవరు శాసనసభా ప్రవేశమొనరింపక మంత్రిపదవుల స్వీకరింపక నిర్మాణ కార్యక్రమమే కొనసాగించెడివారు. నిర్మాణ కార్యక్రమమునకుఁ దోడ్పడవలె నని బాబు పాట్నా పురపాలక సంఘాధ్యక్షుఁడై యొక సంవత్సరము పనిచేసెను. కాని దాని కచటఁ దావు లేదనియు స్వేచ్ఛ యే మాత్రము గానరాదనియు, నది వట్టి నేతి బీరకాయ వంటిదనియు గ్రహించి యా పదవి నచిరకాలముననే వదలెను.

అంతఁ గొంత కాలమునకు సైమను కమీషను రాక సంభవించుటయు, భారతీయు లొక్కుమ్మడిగ దానిని బహిష్కరించుటయు నీవఱకే చదివియుంటిరి. ఈ సంఘటనమున బీహారమునఁ దన బలుకుబడిని వినియోగించి సమ్మె సంపూర్ణమగునట్లు లొనరించెను.

నెహ్రూ నివేదిక నిరాకరింపఁబడిన పిమ్మట మరల సత్యాగ్రహము ప్రారంభమగుట మీ రెఱింగిన విషయమే. ఉప్పు సత్యాగ్రహమును గూడఁ దెలిసికొని యుంటిరి. ఈ విషయమున రాజేంద్రుఁడు వేలకొలది శాంతి సైనికులను స్వయంసేవకులను సిద్ధపఱచి యీ సమరరంగమున కురికెను. ఈ సమరముననే మన ప్రసాదునకుఁ బోలీసువారిచే గుఱ్ఱపు కాలి దెబ్బయుఁ దీవ్రమగు లాఠీదెబ్బలుఁ గూడఁ దగిలెను. ఈ దెబ్బల కతని శిరము భిన్నమై మృత్యువాతఁ బడునేమో యను సందేహము కలిగెను. ఈ సమర సమయమున బాబు బలుమారులు కాంగ్రెసునకుఁ దాత్కాలిక అధ్యక్షుఁడయ్యెను. కాని యచిరకాలమునఁ గారాగార వాస మబ్బెను. విడుదలైన పిమ్మటఁ గూడ మరల నొకసారి కాంగ్రెసునకుఁ దాత్కాలికాధ్యక్షుఁడై మిగుల చాకచక్యముగఁ గార్యక్రమమును సాగించెను. దేశమును సరియగు మార్గమున నడపి తన కార్య విశారదత్వమును జూపెను.

పిమ్మట గాంధి - ఇర్విను సంధియు, రెండవ గుండు టేబిలు సమావేశమును జరిగెఁగదా! ఈ సంధి నియమముల దేశీయులు ఖండితముగఁ బాటించునట్లు బాబు మిగులఁ గృషియొనర్చెను. కాని యేమి ప్రయోజనము? ప్రభుత్వము వారే వానిని భంగపఱచిరి. మరల సత్యాగ్రహము ప్రారంభమై రాజేంద్రుఁడు మరల నొకసారి నిర్బంధమునకు గుఱి యయ్యెను.

హిందూ మహమ్మదీయ సఖ్యమునకుఁగూడ రాజేంద్రు డత్యంత కృషి యొనర్చెను. దేశ మెల్లెడల మతద్వేషములు చెలరేగి హింసాదేవత తాండవమాడు సమయములందుఁ గూడ బీహారమున నెప్పుడును నట్టి మతకలహములు సంభవించి యుండలేదు. దీనికిఁ గారణము రాజేంద్రుని నిరంతర కృషియె. ఆతఁడు నిర్మింపఁ గలిగిన శాంతి వాతావరణ ఫలితమే. అతని ముఖమండలమునఁ గల విద్యుచ్ఛక్తి ప్రభావమే.

మహాత్ముని యడుగుజాడల మెలఁగు రాజేంద్రబాబస్పృశ్యతా నివారణ విషయమునఁ గూడ నత్యద్భుత కృషి యొనర్చెను. బీహారమునఁ గల దేవాలయములం దెన్నిటనో హరిజనులకుఁ బ్రవేశమిచ్చి, వారిని సవర్ణుల బావులలో నీరు తోడుకొననిచ్చి వారికొఱ కెన్నియో విద్యాలయముల నిర్మింపఁజేసెను. స్వరాష్ట్రమున నిట్లత్యంతకృషి యొనర్చుటయేకాక యీ సందర్భమున నతఁడు మన దక్షిణభారతమునఁ గూడఁ దీవ్రప్రచార మొనర్చెను.

ఇట్లు క్షణమైనను తీరిక లేకుండ దేశము కొఱకును సోదర మానవుల కొఱకును శ్రమపడుటవలనఁ బెక్కుసారులాతని కారోగ్యభంగ మయ్యెను. అసలే దర్భకట్టవంటి దుర్బలగాత్రుఁడు. దానితో జడ తెగని కారాగారవాసము. అన్నిటికిని మించి తీరనిపని. వీనివలన నాతని శ్వాసవ్యాధి యెక్కువగుటలో నక్కజ మేమున్నది ? కారాగారవాస

మున నీరస మెక్కువై మిగుల శుష్కించి ప్రాణాపాయస్థితికి వచ్చినను కఠిన హృదయులగు ప్రభుత్వమువా రాతనిని వదలరైరి. తుద కెట్లో ప్రభుత్వ చికిత్సాలయమునఁ జేర్చిరి. వైద్యసంఘ సలహా ననుసరించి యాతనిని విడువక తప్పినది కాదు.

రాజేంద్రుఁ డెంత రాజకీయవేత్తయో యంత సాహిత్య వేత్త. ఇంతటి సాహిత్యాభిమాని మన నాయకులం దింకొకరు లేరు. హిందీసాహిత్య మాతని కెక్కు డభిమానప్రాయము. బీహారు విద్యాపీఠము నిర్మించి దాని కుపద్రష్టయై యద్వితీయ సేవ యొనరించె నంటిమిక దా! అంతియే కాక పెక్కు సాహిత్య సంస్థలందు సభ్యుఁడై యనేక పత్రికల నిర్వహించెను. కాకినాడ యందు జరిగిన యఖిలభారత హిందీసాహిత్య సమ్మేళనమున కితఁడే యధ్యక్షుఁడు. అనారోగ్య కతమున నటకు రాఁ జాలకయుఁ దన యధ్యక్షోపన్యాసమును వ్రాసి పంపెను. చూడుడు! వాని సాహిత్యాభిమానము! హిందీభాషయం దాతని సుప్రసిద్ధములగు రచన లెన్నియోని గలవు.

ఖద్దరుద్యమమునఁగూడ రాజేంద్రుఁ డసామాన్యమగు కృషి యొనర్చెను. ఖద్దరువస్త్రధారణ మనిన నాతనికి మిక్కిలి యభిమానము. బాల్యమునుండియు స్వదేశవస్తువులను వస్త్ర ములను గూడఁ బ్రాణపదముగ నెంచువాఁడు. అతని వేషము ముతుక వస్త్రములతోఁ బల్లెటూరి పేదరైతు వేషమువలె నుండును. ఆతఁడు ఖద్దరును బ్రోత్సహించి వ్యాప్తి చేయుటకై

ఖాదీ యర్థశాస్త్ర మను నొక గ్రంథమునుగూడ రచించెను. మహాత్ముఁ డీ గ్రంథమును మిగులఁ గొనియాడెను.

ఇట్లు రాజేంద్రుఁడు పాల్గొనని రాజకీయాందోళనము లేదు. పాటుపడని ప్రజాహిత కార్యము లేదు. సేవచేయని కార్మిక కర్షకోద్ధరణ వ్యవసాయము లేదు. అడుగువెట్టని మానవ కల్యాణ మార్గము లేదు. ఆయన నిరాడంబర జీవనము తోడి నాయకుల కాశ్చర్యము గొల్పినది. సౌశీల్యము సోదర మానవుల కొజ్జబంతి యైనది. సౌమనస్యము సర్వజన సమాదరణీయమైనది. స్వార్థత్యాగము భారత ప్రజల కుపకారకరమైనది. నియమబద్ధ జీవితము నిరుపమానమైనది. దేశారాధన తత్పరత్వము దివ్యమైనది.

ఆయనను సర్వసంగ పరిత్యాగి యనవలెనో, ఫకీరనవలెనో, సన్యాసి యనవలెనో, భారతీయుల పాలిటి కల్పవృక్ష మనవలెనో తోచకున్నది. బీదల కాహార పానీయాది సౌకర్యములు కల్పించుటయే యాతని పరమోద్దేశము. కానఁ బిదప హిందూస్థానమున నాహారశాఖా మంత్రియై క్లిష్ట సమయమున నాహారసమస్య పరిష్కరింప నత్యంత ప్రయత్న మొనర్చినాఁడు.

భారత స్వాతంత్ర్య మబ్బిన పిమ్మటఁ దాత్కాలిక రాజ్యాంగమున మన ప్రసాదే యధ్యక్షుఁడు. ప్రజాప్రభుత్వ మేర్పడిన పిమ్మటఁ గూడ నాతఁడే యధ్యక్షుఁడుగ నెన్నుకొనఁబడెను. ఈ పదవి నాతఁడు మిగుల చాకచక్యముగను

ప్రతిభా సమన్వితముగను నిర్వహించుచుండెను. అది కత
మున నాతఁడే మరల రెండవ పర్యాయము గూడ నధ్యక్షుఁ
డుగ నెన్నుకొనఁబడెను. ఈ యెన్నికయే భారత ప్రజల
కాతనిపైఁ గల యాభిమానమును గాఢానురాగమును బ్రక
టించుచున్నది. ఆతఁడు తన కార్యనిర్వహణయందు గొడ్డు
దుడుకులు లేక యధ్యక్షపదవి సాగించుచు నెల్లవిషయములం
దును జవహర్లాలునకు జేదోడు వాదోడుగ నుండుచుఁ
బ్రజామోదమును జూఱఁగొను చున్నాఁడు.

ఇప్పటికిని భరతభూమికి కేతెంచిన పాశ్చాత్య విజ్ఞాన
వేత్తలు, రాజకీయ దురంధులు పెక్కురు మన రాజేంద్ర
ప్రసాదును దర్శించి పోవుచుందురు. ఆయనయు వారికి తన
రాజభవనమున నాతిథేయ సత్కారము లొనరించి విందు
లాచరించి వారి దేశపరిస్థితుల గూర్చి సావధానముగ చర్చించి
రాజమర్యాదలతో సాగనంపుచుండును. ప్రతి సంవత్సర
మును తన రాజభవనమున స్వాతంత్ర్యోత్సవమును, రిపబ్లికు
ఉత్సవమును మహావైభవముగ జరుపుచుండును. ఇటీవల
దేశప్రజలతో నెక్కుడు సన్నిహితత్వ మాకాంక్షించి ప్రతి
సంవత్సరమును నీ స్వాతంత్ర్యోత్సవముల మన దక్షిణరాష్ట్ర
ముల జరుపనెంచెను. తదనుగుణముగ నిటీవల మన ఆంధ్ర
రాజధాని యగు కర్నూలు పట్టణమున నీ స్వాతంత్ర్యోత్సవ
మును మహావైభవముగ జరిపెను. తదవకాశమును బురస్క
రించుకొని మన ఆంధ్ర మంత్రులకును శాసన సభ్యులకును

పెక్కు హితోపదేశము లొనర్చెను. ఏతత్సందర్భమున నిజామునవాబు బోలారమునందలి తన భవనము నొక్క దాని రాజేంద్రప్రసాదునకు శాశ్వత వసతిగృహముగ నిచ్చివేసెను. ఇంకమీదట దక్షిణదేశ పర్యటనకు వచ్చినపు డెల్ల నాతడచ్చటనే మకాము చేయును. స్వాతంత్ర్య దినోత్సవసంరంభమునకు ఢిల్లీకి మరల పోవుచు ప్రసాదు తెలంగాణమున కేగి భూదానయజ్ఞపితయగు వినోబాభావేను ప్రత్యక్షముగ దర్శించిపోయెను. విద్యార్థిలోకమున నపు డచట చెలరేగిన నొకానొక యుద్యమ ఫలితముగ కాల్పులు జరిగినందులకు తన హృదయపూర్వక సానుభూతిని వెల్లడించెను.

దయామయుఁడగు భగవానుఁ డీ సాధుజీవి కనామయము చేకూర్చి యాయురారోగ్య భాగ్యోపేతునిఁ జేయుఁగాత.

